చిట్రిప్రోలు కృష్ణమూర్తి
గామాలపాడు
వయా — దాచేపల్లి
(పల్నాడు తాలూకా, గుంటూరు జిల్లా)

విలంబి పుష్యం
శా॥ శ॥ మాఘం 1880
క్రీ॥ శ॥ జనవరి 1959

ప్రథమ ముద్రణం 1000 ప్రతులు

[ వెల రు. 1—50

ప్రింటింగ్ & బైండింగ్ :
వాణీ ప్రెస్, (గాంధీ చౌక్) నరసరావుపేట.

# అంకితము

కీర్తిశేషులు మా పితృదేవులు

## శ్రీ చిటిప్రోలు వేంకటరత్నం గారికి

సుతుఁడు ప్రయోజకుం డగుటఁ జూచి కనుందొవ లందుఁ జంద్రికా
మృతములు నింపుకోఁ గల యదృష్టము గల్గకపోయె నంచు నీ
పితృహృదయ మ్మదెంత పరివేదన చెందినదో కదయ్య! దు
ర్మృతి తరుణమ్ము రాక మునుపే నిను మ్రింగఁ గడంగి సంతటన్

జనకా! నీ కనుమూయు నాఁటికిఁ బ్రపంచం బింత గుర్తింప నే
రని బాలుండను గాన ధర్మము నధర్మం బింత యూహింప నే
రని యజ్ఞానిని గాన నీ పదము లారాధింప లేనైతి నా
జనువున్ ధన్యముఁ జేసికో నయితి బాష్పక్లిన్న భాగ్యుండనై

నా కవితానందనమున
రేకులు విప్పినది యీ సుకృతి నెఱిపూవై
నీ కంకిత మొనరించితిఁ
జేకొని పితృఋణవిముక్తుఁ జేయవె! నన్నున్

# మనవి

కైకేయీ పశ్చాత్తాపం ఈ కావ్యంలో ప్రధానాంశం. మఱి కైకేయి పశ్చాత్తాపం చెందినదనడానికి ఆధారమేమిటి?

మానవ మనస్తత్వాన్ని జాగ్రత్తగా నిశితంగా పరిశీలించి చూస్తే ఒక విషయం తెలియవస్తుంది. ఏమిటది? నిష్కారణంగా ఒకనిక్కొకనికి ఏదో ఒక దుర్ముహూర్తంలో అపకారం చేసిన ప్రతివ్యక్తీ జీవితంలో ఏదో ఒకనాడు ఆ అపరాధాన్ని తలంచుకొని పశ్చాత్తాపపడి తీరుతాడు. అయితే తన తప్పును బయటికి మాత్రం అంగీకరించక పోవచ్చు. ఆత్మాభిమానం అడ్డు వస్తుంది. అది వేఱు విషయం. ఇక ఆ అపరాధి అజ్ఞాని, దురాత్ముడూ అయిన పక్షంలో ఆ పశ్చాత్తాపం కలగడానికి దీర్ఘకాలం పట్టవచ్చు. ఆ అపరాధి ఏమాత్రం జ్ఞానమున్న సహృదయుడైనా వెంటనే పశ్చాత్తాప పడతాడు.

మఱి– రాముణ్ణి పెంచి పెద్దచేసిన కైక– రాముడంటే ప్రాణాలు విడిచే కైక ఒక అకార్యం– అదీ బుద్ధిపూర్వకంగా గాక మంథరా దుర్బోధ వల్ల హృదయంలో తుపానులు చెలరేగిఉన్న దుర్ముహూర్తంలో– చేసినా తరువాత పశ్చాత్తాపం చెందకుండా ఉంటుందా?

పండిత లోకంలో కైకేయి పట్ల సదభిప్రాయమే ఉన్నా, జనసామాన్యంలో మాత్రం ఆమె పట్ల నిరసనభావం పాదుకొనిపోయింది. 'గయ్యాళి' కి 'కైక' ను పర్యాయపదంగా వాడే వఱకూ పోయింది ఈ దురభిప్రాయం. ప్రజాబాహుళ్యంలో వేరుదన్నిన ఈ దురభిప్రాయాన్ని తొలగించడమే ఈ కావ్యరచనోద్దేశం.

పాఠక మహాశయులు పశ్చాత్తప్తమూ, పరిక్షుబ్ధమూ అయిన కైకేయీ హృదయాన్ని అవగతం చేసికొని ఆమె పట్ల ఏ మాత్రం సానుభూతి ప్రకటించినా ఈ నా కృషి ఫలించినట్లే!

— కృష్ణమూర్తి

# కైకేయి

ఎవ్వాని పదరజం బింత సోఁకిన మాత్రఁ
గలుష సంఘము ధూళిఁ గలిసిపోవు
ఎవ్వాని నగుమొగం బింత చూచిన మాత్ర
నెమ్మదిం బండు వెన్నెలలు గాయు
ఎవ్వాని పసిఁడి పల్కింత వినిన మాత్ర
వీను దోయిని సుధాబిందు లొలుకు
ఎవ్వాని ఘననామ మింత యెంచిన మాత్ర
భవబంధములు పటాపంచ లగును

ఆ మహౌదార్యమూర్తి శ్రీరామమూర్తి
హైమ సింహాసనమ్మున నధివసించుఁ
దేజములఁ బెంచు ననియెడి దివ్యవార్త
యెవరి కానంద మొసఁగ దీ సృష్టి లోన ?

కైకేయి

గ్లానిన్ హానిఁ దొలంచు రాఘవుని శ్రీకల్యాణ పట్టాభిషే
కానూనోత్సవ దివ్యవైభవముఁ గన్నారన్ విలోకించి బ్ర
హ్మానందమ్మునఁ దేలఁ గోరెడు ససంఖ్య ప్రాప్తించె సంఘమ్ము నం
దే నొక్కర్తెను గాక యుండుటకు మన్నే? హేతు వావంతయున్

ఏ రఘురామచంద్రుఁడు మహీరమణుం డయి భద్రపీఠి రా
ప్పారుటఁ జూచి సంబరము నంద వగ ల్ముదిలాట మందునో
ఆ రఘురామచంద్రుఁడు నృపాసన మెక్కుట తప్పెనైన నా
పేరిమిఁ జూపు నా మదికిఁ బ్రీతికరం బెటు గాక యుండెడిన్?

కనినది కాని కోసల నృపకాంతుని కూఁతురు రాఘవాన్వయం
బున కొక రత్నదీప మయి పొల్పెడి నిల్చెడి రామచంద్రునిన్
అనుపమ మైన ప్రేమ హృదయంబున నూల్కొనఁ జేరఁ దీసి పెం
చినయది పెద్దఁ జేసినది నేన కదా! విమలాంతరంగనై

జగదుద్ధారకుఁ డా సుపుత్త్రకునిఁ గాంచం గల్గు శ్రీయోగ మె
బ్బంగఁ గౌసల్య యెడంద నిండిన యనల్పప్రీతికిన్ వేయి రె
ట్లగు నానందము నందడించినది కాదా! నా యెదన్ దస్మహి
ష్ఠ గుణాధారునిఁ జేరఁ దీసెడు నదృష్టం బింత చేకూరఁగన్

ఎన్నఁగ రాని ప్రేమఁ గురియించితిఁ, గన్నులఁ గప్పుకొంటి రా
మన్నను, గాఁపుసన్ జన పసంతము నాయెడ వానికిన్. సదా
నన్నుఁ దలంచుచున్ దిఱుగు నా గృహ మంద చరించుచుండు, నన్
గన్నులఁ జూడకుండ నొక నాఁడును నిల్వఁగఁ జాలఁ డక్కటా!

కడుపునఁ బుట్టు టొక్కఁ డధికం బయినన్ భరతుండు రామచం
ద్రుఁడు సములే సుమంతయును దోఁపదు భేదము, నాదు మాట నె
య్యెడ జవదాఁటియే నెఱుఁగునే? చిటివ్రేలను జూపు దానినిన్
గడుఁగడు గౌరవంబు తొలఁకాడఁగఁ దాఁ దలతోడఁ గైకొనున్

శర సంధాన కళా విచిత్రములు నా చాతుర్యముల్ చూపి దాఁ
పటికం బింతయు లేని స్వచ్ఛతర మా స్వాంతమ్ముతో దీక్షతో
దరిసెం జేరి ధనుః పృషత్కములఁ జేతం బూన్చి శస్త్రప్రయో
గ రహస్యమ్ములు దెల్పనే! రణకళా కౌశల్యముల్ గూర్పనే!

పదునాలేఁడులు నిండి నిండని లఘుప్రాయంబునన్ దాటకా
మదమద్రాక్షసి నొక్క బాణమునునే మాయించె రాముం డహో!
తదుదంత శ్రవణంబునన్ మది యమందం బైన సంప్రీతిఁ జెం
దదె? నా నేర్పిన చాపవిద్య ఫలవంతం బై ప్రదీపింపఁగన్

కులము సముద్ధరించు కొడుకుల్ సుమి! నల్వురు గూడ, నిట్టి ని
స్తుల గుణసాంద్రు లుజ్జ్వల యశోధను లుద్భవ మందుటల్ పురా
కలిత నితాంత పుణ్యమునఁ గాదొకొ! విశ్వ జగన్నుత ప్రభా
కలితుఁడు నన్నిటం బ్రథమ గణ్యుఁడు మాన్యుఁడు రాముఁ డింతకున్

ఆ రఘురాజచంద్రుఁడు మహామహిమాఢ్యుఁడు పూర్వుఁ డౌట నే
పారెను వంశకర్త యయి; యాతని మించిన మేటి యంచితో
దారచరిత్రుఁ డుత్కట మహః పరిపూర్ణుఁడు రామచంద్రుఁ డీ
ధారుణి ధర్మదండమును దాల్చుట కంటెను భాగ్య మున్నదే?

సవతి కుమారుఁ డంచు మది సంతస మంద కసూయఁ జెందఁగా
నవసర మేమి? నన్నుఁ దన యమ్మను భేద మొకింత లేక యే
కవిధి గణించు చుండు, సమగౌరవముం బ్రకటించుచుండు, నే
యవసర మందుఁ జూపఁ డిసుమంతయు వేఱిమి దుర్వినీతుఁడై

ఎచ్చట శౌర్యలక్ష్మి గలు, దెచ్చట సత్యము ధర్మ మొప్పు, నిం
కెచ్చట శాంతిదాంతులు రహించు, మ తెచ్చట మించు నార్జవం
బచ్చట మెచ్చు లాడక సమాదృతిఁ జూపక మానసోత్తముల్
మచ్చరికింతురా? తెలివి మాలుదురా? చెడుత్రోవఁ బోదురా?

కైకేయి

ఆకృతి గొన్న సద్గుణ మహత్త్వమ యై చెలువొందు భాస్కర
శ్రీకుల సోము రాము నభిషిక్త శిరస్థ్స మణీకిరీట శో
భా కమనీయ రేఖికలు పర్విన గాఢతమస్సు లింకవే ?
యే కుటిలాంతరంగమున నేసియు నిండవె పండు వెన్నెలల్ ?

ఫలపుష్పప్రవిభాసితం బయిన కల్పక్ష్మారుహశ్రేష్ఠ మా
నళినీబంధు కులావతంసము, తదానందప్రదచ్ఛాయలో
నిలువన్ వచ్చు జగమ్ము లెన్నయినఁ గానీ చింత లేకుండఁగన్
మెలఁగన్ వచ్చుఁ గొఱంత యెందయినఁ గానీ సుంత రాకుండఁగన్

ఆతఁడు జ్యేష్ఠుఁ డౌట మహిమాన్వితుఁ డౌట సమస్త ధర్మ ని
ర్ణేతలు పూజ్యుఁ డౌనని గణించుట నన్నిటి మించి భూజన
వ్యాతత గౌరవాదరము లందుట సర్వ విధాల నర్హుఁ డీ
భూతల మేల; నా ఘనునిఁ బోలిన యోగ్యుఁ డొకండు గల్గునే ?

ఈ రవివంశ మెప్పుడు జనించిన దప్పటి నుండి జ్యేష్ఠుఁడే
భూరమణీ కరగ్రహణముం బొనరించుచు నుండె, నీ సదా
చారము సుప్రశస్తముగ సాగుచు నున్నది నేఁటి దాఁక నె
వ్వారలు నీ నిబంధనముఁ బాయఁగఁ ద్రోయఁగఁ జూడ రెన్నఁడున్

అన్నియు నుండి యొక్కఁ డఱ యల్పపు టర్హత యేది యైన లే
కున్నను గాని యగ్రజు నయోగ్యుఁ డటంచును ద్రోసి పుత్తురా ?
పిన్నను యౌవరాజ్య పదవీ సమధిష్ఠితు నాచరింతురా ?
అన్నకుఁ దమ్ము లన్నిట సహాయులుగా నడచూడకుందురా ?

ఏమన వచ్చు రాముని యహీన మహామహిమానుభావ మూ
హా ! ముకుపచ్చలున్ సరిగ నాఱని ముద్దుల తండ్రి జ్ఞాన తే
జోమయు లబ్జయోని సదృశుల్ సకలజ్ఞులు మా వసిష్ఠ ము
ఖ్యామిత మానితాఖిల మహర్షుల కాదరణీయుఁ డయ్యెఁ బో !

వయసునఁ జిన్న యౌట నభివందనముల్ పొనరించుటల్ విప
ర్యయ మని సంశయించి వెనుకాడుచు నుండిరి, కాక యున్న న
వ్యయ వినయం బెలర్ప వినతాంగములన్ బులకించు గుండెలన్
మొయికొని దోయిలింపరె ? నిమీలిత లోచన యుగ్మకమ్ములన్

అరయని వాఁడె గాధిసుతుఁ డంబర మధ్యము నందు స్వర్గమున్
విరచన చేసి యున్న మహనీయుఁడు; భూరి పరాక్రమక్రమ
స్ఫురితులు కొండలం బొడుచు పోటరు లెందఱు లేరు ? కన్నులున్
దెఱవని మూడు చిట్టి రఘుదేవునె యేటికిఁ గోరి కైకొనెన్ ?

ఎంత మహానుభావము రచింప వలెన్ బతిదేవ శాప వి
క్రాంతికి రూపుఁ గోలుపడి ఱా యయి దిక్కఱి యున్న మౌని సీ
మంతినికిన్ మనోజ్ఞ సుకుమార పదాబ్జపుఁ దాఁకునన్ బ్రభా
వంతము పూర్వరూప విభవమ్ము నొసంగి సముద్ధరింపఁగన్ ?

దశముఖు నంత బాహు బలధాముసకుం గదలింప రాని యా
పశుపతి చాపరాజమును వామకరమ్మున దంతకాష్ఠపున్
విశకల మట్టు లెత్తి సరవిన్ దునియల్ పొనరించె నౌర ? " కీ
దృశ బలశాలి బాలుఁ డరెరే ! " యని సభ్యులు విస్మయంపడన్

" సకలోర్వీ వలయమ్ము నుద్దవిడి నిఃక్షత్రమ్ము గావించి తం
డ్రికిఁ జేకూర్చెద నాత్మశాంతి " యనుచున్ జృంభించి రాజన్య కం
టకుఁడై మించిన జామదగ్న్యుఁడు ప్రచండక్రోధమార్తాండుఁ డిం
చుకయుం గొంచక వాని మ్రోలఁ గరముల్ జోడించె శ్రద్ధామతిన్

అతని బుద్ధి వైభవ మహత్త్వ మనంతము, సర్వధర్మ సం
వేత్తృత మౌని నాథులును మించఁగఁ జాలరు వాని, నా జగ
త్పూత ముఖోద్గతంబు లయి పొల్లులు రా వెపుడైనఁ, దద్వచో
వ్రాతము సత్యధర్మ వినిబద్ధమ యై పొలుపొందు చుండెడిన్

ఆ సువిశాల నేత్రముల యందు నిరంతరమున్ వలక్ష్య రే
ఖా సముదీర్ణ కాంతి తొలఁకాడుట చూతుమె కాని రక్త రే
ఖా సముదగ్ర దీప్తి తొలఁకాడుట చూత మటన్నఁ గాన రా
దే సమయంబు నందు నొక యించుకయున్ బ్రయతించి చూచినన్

తన కే చింతయు లేక స్వర్ణమయ సౌధశ్రేణి నానంద డో
లను దూఁగాడుచు నున్నఁ గాని త్రుటి కాలం బేని సాకేత భూ
జన సంతానము విస్మరింపఁడు, సదా శ్రద్ధాళుపై యాలకిం
చును దత్కష్టసుఖమ్ములన్, వెలువరించున్ సానుభూతిం గడున్

ప్రమిదల రూపుకొల్పిరి పురప్రజ లందఱుసున్ నిజాంతరం
గముల, రఘుప్రకాండుఁ గళికం బొనరించుక తాపుకొల్పి రా
ప్రమిదల లోపలన్, గళిక వల్లను నా ప్రమిదల్ రహించు, నా
ప్రమిదల వల్లనుం గళిక భ్రాజిలుఁ దేజము పెంపు నింపుచున్

పరువున వచ్చి "కోసల నృపాల తనూభవ ముద్దు పట్టి సుం
దరతర సింహపీఠికఁ బదంబును మోపఁగ నుండె" నంచు మం
థర వచియించి నంత నమితం బగు సంబర మంది నా మెడన్
పఱలెడి తారహారము నుపాయన మిచ్చితి, నిచ్చ మెచ్చితిన్

నా యంతస్సున నిండుకొన్నయవి యానందామృతజ్యోత్స్నికల్
నా యక్షిద్వయి నిండుకొన్నయవి యానం దాశ్రు ముక్తాతతుల్
శ్రేయోదాయక మైథిలీ హృదయ రాజీవాంశుమాలీ జగ
చ్ఛ్రేయోవర్ధక పట్టబంధన మహో వృత్తాంత మాలింపఁగన్

హృదయము నందుఁ గ్రందుకొనియెన్ వచియింపఁగ రాని పూర్వ మే
యదనున నంద రాని యధి కాధిక హర్షము, స్వర్ణదీ సుధా
మధు జల మందుఁ గ్రుంకిన యమంద సుఖానుభవంబుఁ గంటి నా
సదమల వార్త విన్న నిముసంబున యం దకలంక చిత్తనై

పంచప్రాణము లందు నొక్కటిగ సంభావించి చామీకర
ప్రాంచద్భాండికతో సుధాజల సుధార ల్వోసి వాత్సల్యముల్
పంచారింపఁగఁ బెంచుకొన్న మొల కే బ్రహ్మాండ వృక్షాకృతిన్
గాంచం గల్గుట కన్నులారఁ గను భాగ్యం బెంచి యుప్పొంగితిన్

ఆ నా పెంచిన కల్ప భూరుహము చాయన్ నిర్విచారమ్ముగా
మేనున్ వాల్చి తదీయ దివ్యఫల సామీచీన్య సేవా నితాం
తానందమ్మునఁ దచ్ఛ మాపనయ నోద్యద్వీచి కాందోళన
వ్యానందమ్మున సర్వమున్ మఱచి పోనై యుంటి నం చుబ్బితిన్

కై కే యి

ఈ సాకేత పురీ సమస్త జనతా హృద్వీథు లం దెన్నఁడో
మోసెత్తెన్ గమనీయమూర్తి విపదంభోరాశి మగ్నప్రజా
త్రాసక్లేశ నిరాస లాలసుఁడు సీతారాముఁ డీ కోసల
క్ష్మా సమ్రాట్తిలకమ్ము గావలయు నన్ భావ మ్మొకం డిమ్ముగన్

ఎన్నఁడు జానకీపతి యహీన సువర్ణ నృపాసనమ్ము పైఁ
బ్రన్నని పాద ముంచు జిగి వాడని స్వార్గిక శోభ నించు నిం
కెన్నఁ డిఁ కెన్నఁ డంచు వినిరీక్షణ సేయు ప్రజా సమూహపుం
బున్నెము పండె నిండు ఫలముం గననుండె నటంచు నెంచితిన్

ఇంత కొఱంత లేక సుఖియించుచు నుండె జగజ్జనమ్ము నా
కాంతుని రాజ్య మందుఁ, ద్రిజగన్నుత సచ్చరితుండు జానకీ
కాంతుని పాలనం బిఁక సుఖప్రద మై త్రిదివోపమాన మై
యెంతయు వాసిఁ గాంచు నని యెంచితిఁ, బెంచితి హర్ష వల్లికన్

జనపతి వృద్ధుఁ డయ్యెఁ, జవసత్త్వము లల్పము లయ్యెఁ, రాజ్య పా
లన విధి నిర్వహింప విపులశ్రమ లం బడుచుండెఁ, జ్యేష్ఠ నం
దనునకు రామచంద్రునకుఁ దత్ప్రథు బాధ్యత లప్పగించినన్
బనుపడు విశ్రమం బలఁత పాయు నటంచు ముదంబుఁ జెందితిన్

మూవు రనుంగుఁ దమ్ములు త్రిమూర్తులతో సరితూఁగు వారు వి
ద్యా విన యాది సర్వ సముదార సముజ్జ్వల లక్షణమ్ములన్
జేవ దలిర్చు వారు దరిఁ జేరి బరాబరు లాచరించు సు
శ్రీ విభవమ్ము లెంచితిని శ్రీ రఘురాముని చిద్విలాసముల్

పావిత్ర్యమ్మున కాటపట్టు మహిళా పాళీ శిరోభూషణం
బా వైదేహి రమా సవిత్రి వలె వామాంకమ్ము నం దొప్పఁగా
శ్రీ విశ్వంభర మూర్తియో యన మహో రేఖల్ ప్రసారించు మా
దైవం బంచు నెడందఁ గంటి నతిమాత్రం బైన యుత్కర్షమున్

“ వేదన లెట్టి వైన మఱపించెడి చల్లని మేలి వార్త సూ
ర్యోదయ వేళ మేలుకొను చుండఁగనే విన నయ్యె బాపురే !
యీ దిన మెంత పుణ్యదిన ! మింతటి పుణ్యదిన మ్మొకండునున్
నా దగు జీవితమ్మునఁ గనంబడ దబ్బము లిన్ని చెల్లినన్

ఈ మధురంపు వార్త శరదిందు సుఖాతప శీత వార్త క
ర్ణామృతకల్ప వార్త సముదాత్త మ దశ్రుతపూర్వ వార్త నీ
వై మునుముందు తెల్పితి వహా ! శుభమంగళవాణి ! నీ హితం
బే మని యందు ? నీ ఋణము నెట్టులఁ దీఱిచికొందు ? మంథరా !

అతితర మైన తావక హితాచరణమ్ముల కుం గృతజ్ఞతా
దృతు లెద నిండుకొన్నయవి యీ యసమాన మహోపకారపుం
బ్రతిఫల మేమి కోరెదవొ వైళమ కోరు! మ దెట్టి దైననున్
ద్రుతగతిఁ దీర్చి వైచెద నిరూఢ కృతజ్ఞత వెల్లడించెదన్

జిలుఁగుం బట్టు పసిండి పుట్టములనే చేకొందువో! లేక క్రొం
దళుకుల్ చిమ్మెడి రత్న హారముల మీఁదన్ మక్కువో! కాక నిన్
దుల యం దుంచి త్వదీయ భారమునకున్ దుల్యమ్ము లౌ పైఁడి రే
కుల నిమ్మందువొ! సంశయంపడక వాకొ" మ్మంచు వాక్రుచ్చితిన్

పెన్నిధిఁ గాంచి నట్టి నిఱుపేద విధంబున నూర్ధ్వ లోక సౌ
ఖ్యోన్నతు లంది నట్టి దురితోగ్రుని పోలిక నిష్కళంక ని
ష్పన్న మనస్కతన్ బరవశించెడి నన్గని మంథరా ముఖం
బన్నల! భాను మండలమ య్యె యెఱుపెక్కె నదేమి చిత్రమో!

"చాలుం జాలును నీదు నుల్బణము, నీ సంతోష వారాసు లం
భో లేశంబును లేక యింకెడి క్షణంబుల్ చేరు వౌ చుండఁగా
నేలా యూరక పొంగిపోదు విటు లిస్సీ! బాడబప్రోద్ధత
జ్వాలా మాలలు రేఁగి మూఁగు నవె దుర్వారంబు లై చూడవో!

ఒక వనసీమ లోన నమి తోల్లసనమ్మున స్వేచ్ఛగా విహా
రకలనఁ దేలు చుంటివి నిరంతర హర్ష మెలర్పఁ బూవు డో
లికలను నూఁగు చుంటివి బళీ ! నలు వైపుల నుండి దావ పా
వకుఁ డెసరేఁగి క్రమ్ముకొని వచ్చుట కంటికిఁ గానిపింపదో ?

కన దుత్తుంగ విశాల సౌధమున రంగ ద్రాజహంసీ గరు
ద్ఘన తల్పమ్మున మోడుపుం గనులఁ జింతా కంతయున్ జింత లే
క నిరాతంకత నిద్రఁ గూరెదవు ! భూ కంపమ్ము దుర్దాంత మై
యనివార్యం బయి దండడిం జలుపు టాపం తైన వీక్షింపవో !

రాముఁడు కోసలమ్మునకు రా జగు నన్నుఁ ద్రివిష్టపంబె యీ
భూమికి డిగ్గి వచ్చి నటు భూరి ముదమ్మునఁ జెంగలింతువే !
రాముఁడు భూవరుం డయినఁ ద్రాగుట కైనను బచ్చిగంగయున్
క్షామము యౌను నీ కనెడి సత్యము నింతయు గుర్తెఱుంగవే !

తన కొమరుండు సర్వ వసుధా వరుఁ డై యధికార ముద్రఁ గై
కొనెడు నపూర్వ గౌరవము కూడినఁ దా నొక రాజమాత యై
తనరినఁ గోసలేంద్రు దుహితన్ మఱి పట్టఁగఁ బగ్గ ముండునా ?
కనులును నెత్తి కెక్క నధికార మదాంధత నిగ్గణించునా ?

అవురా! యెంత విచిత్రత! మర్కుఁ డుదయం బౌ నంత కే యింత యు
త్సవ సన్నాహము పూర్తి యయ్యెనె! యయోధ్యా పట్టణం బంతయున్
దివిషత్పట్టణ మ ట్లలంకృతుల సుద్దీపించెనే ! నిన్న ను
త్సవపున్ సన్నయు గోచరింపదు రహస్యం బేమిటో కైకయీ !

కొప్పున నగ్గి యంటుకొని కొంపలు భగ్గున మండు వేళలో
గొప్ప విపత్పరంపరలు కొండ లటుల్ పయిఁ బడ్డ వేళలోఁ
దప్పుకొనంగ నేదొ యొక దారినిఁ జూడక బుద్ధిహీన యై
యొప్పరికించు దాని నిను నొక్కరితం గనుఁగొంటి నేఁటికిన్ "

అని యీ త్రోవ నకారణమ్ముగ నసూయాగ్రస్త యై తీవ్ర కో
పన యై కొంప మునింగి పోయి నటు లార్భాటమ్ము గావించు కు
బ్జ నుడుల్ సుంత గణింపఁ బోవక ముఖాబ్జాతమ్ముపై నొక్క పి
న్నని న వ్వుప్పతిలన్ నిరాకుల మతిన్ వాకొంటి నీ రీతిగన్

"ఎట్టి దురంత చింతలఁ దపించి కృశించెడి వారి కేనియున్
బట్టఁగ రాని సంబరము ప్రాప్తిలు నిట్టి శుభోదయమ్మునన్
బుట్టి మునింగి నట్లు పెను మోసము ముంచుక వచ్చె న ట్లయో
బి ట్టగు కోప శోకములు పింపిసలాడఁగ నేడ్తు వేటికే ?

ప్రియతమ మైన మాట నతిరేక సుఖావహ మైన మాట నీ
వయి వచియించి నందులకు నై "శుభమంగళవాణి" యంచు న
వ్యయ పరితుష్టి మైఁ బిలిచి నందులకా యశుభంకరమ్ము ల
ప్రియములు వల్క సాగితి ? వివేకము నీఁగితి ? వోసి మంథరా !

కన్నుల కర్వు దీఱఁగ జగజ్జన కోటి చకోర కోటి యై
చిన్ని కుమారు రాఘవుని శ్రీకర మైన ముఖేందు బింబమున్
దిన్నఁగఁ జూచి మోదమునఁ దేలుచు నుండఁగ నీ వొకర్తె వీ
తెన్నునఁ జక్రవాకి వయి దీల్పడ నేటికి ? వెఱ్ఱి మంథరా !

ఆ కమనీయమూర్తి మహి తాద్భుత పాలన శాంతి సౌఖ్య రే
ఖా కర మై యుపద్రవ నిఘర్ష నివారక మౌ నటంచు నా
శా కిరణమ్ముగాఁ దలఁప సాగెఁ బ్రజాతతి యమ్మహోదయున్
నీ కొక దాని కెందులకు నిస్పృహ గల్గెఁ బ్రతీపదర్శినీ !

మా రఘురామమూర్తి యసమాన మహః పరిపూర్ణమూర్తి వి
స్తార సుధా పయోనిధి గదా ! భువనత్రయమున్ బిపాస చ
ల్లాఱ సుధారసంబుఁ దని వాఱఁగఁ గ్రోలుచు నుండ నాకు నీ
కా రసరాశి నొక్క కణ మైనను నేల లభింప కుండెడిన్ ?

## కై కే యి

దయ దైవాఱ ననారతమ్ముఁ దన ఛత్రచ్ఛాయ క్రిందన్ జగ
త్త్రయమున్ నిల్పి సుఖప్రశాంతు లొడఁగూర్పం జాలు మా తండ్రి య
క్షయ వాత్సల్యముఁ జూపు నా యెడల దౌర్జన్యమ్ము సాగించునా ?
నయముం దప్పి చరించునా ? చుఱుకు టెండన్ నిల్పి కాగించునా ?

ఏ నిఁక నెన్ని జన్మముల నెత్తిన రాముని వంటి పుత్రకున్
జానకి వంటి కోడలి నొసంగు మటంచు నితాంత భక్తి సం
స్థానము నై యభీష్ట వర దాయకు లోకము లేలు నాయకున్
మానక వేఁడికొందుఁ ద్రుటిమాత్రము నేమఱకుండ మంథరా !

ప్రాణము కంటెఁ గూడ రఘురాముఁడు నాకుఁ బ్రియమ్ము గాదె ? యా
సూనుని పట్టబంధనముఁ జూచుట కంటె నదృష్ట మున్నదే ?
దానికి నేటి కింతటి వృథా వ్యథఁ జెందెద ? వీవు నా వలెన్
మానస మందు నెందుల కమంద సుఖానుభవమ్ము నందవే ?

తన కపకారమున్ జలుపు దండ్యుల నైన క్షమా నిధానుఁ డై
నెనరునఁ జూడ నేర్చు మహనీయుఁడు మా రఘురామచంద్రుఁ డే
జనపతి యైన నాకును విశంకట సంకటముల్ ఘటిల్లు నం
చనియెద విట్టి విప్రియము లాడఁగ నో రెటు వచ్చె నీ కయో !

ఇట్టి వృథా ప్రలాపముల నెన్నఁడు ప్రేలకు ! ప్రేలినన్ మెడన్
బట్టుక నాదు నిల్వెడలఁ బాఱఁగ నెంటెద, నిట్టి కూఁత లె
ప్పట్టునఁ గూయ కుండఁ గరవాలున దారుణ కల్మషచ్ఛటా
హట్టము నీదు నాల్క నశుభావహ వాదిని ! కోసి వైచెదన్

అనవసరప్రసంగ విషయాతురతన్ విరమింపు మింక నీ
యనుచిత మైన భాషణము లందె ముహూర్తము దాఁటు నేమొ; భూ
షణము లలంకరించుకొని చయ్యనఁ బోదము కన్నులార నా
ఘను నభిషేక పర్వమును గందము, కందము సార్థకత్వమున్

అని యిటు లా సుపుత్రకుని యభ్యుదయం బభికాంక్ష సేయుచున్
ఘనతర తన్మహోత్సవముఁ గన్గొన నెంతయుఁ దొందరించుచున్
దన యనుదారతన్ గుటిలతన్ నిరసింపఁగ నంకుశాహతిన్
దిను మదవన్మతంగజము తెన్నునఁ గుంచుక పోయి పిమ్మటన్

"అవు నవు నమ్మ ! యి ల్వెడలనాడెదు ? నాలుకఁ గోసి వైచె ! దీ
భువనము నందు నిట్టి క్రమముల్ గలవే కద ! యెల్ల వారిలో
నెవరును మేలుఁగోరి వచియించు సుహృద్ధితబోధ నింతయున్
జెవి నిడ, రంతఁ బోక నిరసింతురు; సత్యము చేఁదు గా దొకో !

అరయఁగ నేరి కైన నిజ మాడిన నిష్ఠుర మే కదమ్మ ! యె
వ్వరును యథార్థ వాదిని రవంతయు మెచ్చరు, పై కొకండు లో
మఱి యొకఁ డై ముఖప్రియపు మాటలు వల్కెడి నేర్పుకాండ్రు క
ల్లములు కడున్ హితైషు లటులం గనిపించుట సాజమే కదా !

పిన్నతనమ్ము నుండి నిను వీఁపున మూఁపున మోసి యుంట న
న్కన్న నిరంత వత్సలత స్వాంతము నం దిరవొంది యుంట నే
చిన్న యవస్థ నీ కొదవి చిక్కులు వెట్టినఁ గాని నా యెదన్
వెన్నెల లాఱి వేగిరమ నిండుకొనున్ నిబిడాంధకారముల్

కావున నేఁడు నీ దగు నఖండ మహా విభవం బడంగి నీ
జీవిత తారకాధ్వమునఁ జిక్కని మబ్బులు గ్రమ్మ నుండఁగాఁ
దీవర మైన క్షోభపడి తెల్పితి నంతియె కాని శేముషీ
శేవధి ! నీకు లేని పెనుఁ జింతలు వంతలు నాకు నేటికిన్ ?

హృదయము లోఁతు పాఁతులు గ్రహింపఁగ నేరవు, తీయతీయగా
నెదొ వచియించి నంత నిజ మే యని యుబ్బెదు, నీదు వల్లభుం
డిది గుఱుతించి నేరుపు మెయిన్ బయి పొట్టును నీకుఁ గోసలే
శ దుహితకున్ ఫలాంతరిత సారము సర్వ మొసంగు చుండెడిన్

అమల గుణార్ణవుండు వినయాదికుఁ డా రఘురామమూ ర్తి ని
క్కమ యగుఁ గా దనం దగదు, కాని జగమ్ముస మంచి చెడ్డలున్
సమయముఁ బట్టి మాఱుటయు సంభవ మమ్మ ! సరోజ సుందరీ
ద్యుమణుల బాంధవక్రమము నుల్లమునం దలపోసి చూడుమా !

పిల్లలు దూర దేశములు వెళ్ళినఁ బండుగ యైనఁ జేసికో
నుల్లము సమ్మతింప, దెటు లొప్పినదో కద ! నేఁడు నీ మనో
వల్లభు మానసమ్ము పిదపన్ దిలకింపఁగ రాని యుత్సవం
బెల్లెడ మోద రేఖ లొలయించు మహోత్సవ మాచరింపఁగన్

భరతుం డిచ్చట నున్న నడ్డ మనుచున్ భావించియే మాన వే
శ్వరుఁ డవ్వానిని మేనమామ కడకుం బంపించెఁ, గాకున్నఁ దొం
దర నేఁ డింతకు నేమి వచ్చె నని యేతత్పట్టబంధంబుఁ దా
జరిపింపం దలపెట్టు నాతని పరోక్షం బందు దుర్నీతుఁ డై ?

వెఱవక నీ కుమారకునిఁ బిల్వఁగ లే దని యీసడించు నే
గఱపకు నైన " నవ్యవధిగా నభిషేకము నిశ్చయించుటల్
జరిగె " నటంచు నుత్తర మెసంగ ముహూర్తము నిన్ననే బయ
ల్పఱచెను గాని ము న్నెపుడొ పార్థివుఁ డియ్యది నిర్ణయించెఁ బో

చీమ చిటుక్కు మన్న నతి శీఘ్రముగాఁ బరువెత్తి వచ్చి నీ
తో మునుముందుగాఁ దెలిపి తుష్టియు హృష్టియు నందు నీ పిభుం
డీ మహితోత్సవమ్ము చెవి నించుక వేయని కారణమ్ము కాం
తామణి ! నెమ్మనమ్మున వితర్కము సేయవె సూక్ష్మ బుద్ధి వై

భరతుఁ డయోధ్య లోన నిఁకఁ బాదము వెట్టిన వాయు దేహ్యుఁడున్
జొరఁబడ రాని బందిగము సొన్పుట నిక్కము, దీర్ఘసూత్ర వై
యురక యుపేక్ష సేయు టిఁక నొప్పునె ? యచ్చటి నుండియే " సరా
సరి " వనసీమ కంపి తనుజాతుని ప్రాణముఁ గాచికోఁ దగున్

ఏమో ! ఆ గహనాంతరాళమున నేనీ కందమూలాశి యై
వ్యామోహప్రవిదూరుఁ డై బ్రదుకు నీడ్వం జూచి సైరించునో !
రాముం డెయ్యెడ శత్రుశేష మణుమాత్రం బుంచ రా దంచు ను
ద్దాముం డై నెపరుం దొఱంగి యమ సద్మం బంప నూహించునో !

అమ్మా ! నీదు సపత్ని భావము దురూహం, బమ్మనీషా మహ
త్త్వ మ్మాశ్చర్యకరమ్ము, కార్య కుశలత్వం బొప్పుఁ గాలోపయు
క్తమ్ముల్ తంత్రము లల్లి కామితము లంద న్నేర్చు నా యమ్మ వ్యూ
హ మ్మా బ్రహ్మకు నేనియున్ దురవగాహం బన్న నీ కే మగున్ ?

ఆ రఘురామచంద్రుని భుజార్గళ మందు సమస్త ధారుణీ
భారము మోపి లిప్తయును బాయక యాయమ కన్నుసన్నలన్
వారక సంచరించు నృపవర్యుఁడు నీ మొగమైనఁ జూడ రా
నేరఁ, డిఁకెట్టులన్ సయిఁప నేర్చెద వీ యవమాన భారమున్ ?

అల కౌసల్య గృహమ్ము లోనఁ బరిచర్యల్ సేయుచున్ దత్పదం
బుల విశ్వేశ్వరి పాప నారుణ పదాంభోజంబులం బోలె నా
దలనున్ దాల్చి భజించి తత్కృపకుఁ బాత్రం బైనచో నిచ్చటన్
నిలువ న్నేర్చెద, వింక వేఱు గతి లేనే లేదు ముమ్మాటికిన్ ”

అనుచున్ మంథర యిట్లమంగళ ముపన్యాసమ్ము గావింపఁగా
నని లోద్ధూత నవీన మంజు లత యట్లాపాద మస్తమ్ము నా
తను వాకంపిత మయ్యెఁ, బాదముల క్రిందన్ భూమియుం గ్రుంగి పో
వు నటుల్ దోఁచెఁ, బెఠిల్లునన్ జిటిలె నిప్పం గొండ యుల్లంబునన్

భరతుఁడు లేని కాలమునఁ బట్టముఁ గట్టఁ గడంగు టొక్కఁడున్
మఱపక యెల్ల సంగతులు నా చెవి నూఁదక నిద్ర వోని భూ
వరుఁ డటు తాదృశప్రముఖ వార్తనె చెప్పక పోవు టొక్కఁడున్
జెలుగని సంశయమ్ములకుఁ జిత్తము నం దెడ మిచ్చె నక్కటా !

అనుఁగుం బిడ్డఁడు ఘోర యాతనల పాలై సాంద్ర నీరంధ్ర కా
నన వీథీ శితకంట కాధ్వముల లోనం గంద మూలమ్ములన్
దినుచున్ గ్రూర మృగాళి మధ్యమున వర్తింపంగ నైనన్ జగ
మ్మున నే తల్లి యెడందలోఁ గఱకు టమ్ముల్ దూసి పోకుండెడిన్ ?

పడఁతికి లోక మందు వశవర్తనుఁ డౌ పతి లభ్య మౌట యే
కడుఁగడు భాగ్య, మట్టి ప్రియ కాంతుఁడు వంచకుఁ డై సపత్నితో
నెడపక సంచరించుచుఁ దదీయ పదమ్ములె పట్టి కొల్వఁగా
బెడిదపు టాన తీయఁ దలపెట్టిన మానవతుల్ సహింతురా ?

అతితర మైన భీతి హృదయమ్ము నగల్పఁగ దిక్కు దోఁప "కీ
వితత విపత్సముద్రమును వేగిరమే తరియించు మార్గ మో
హితవరి ! బుద్ధి సూక్ష్మత రహింపఁ దలంచి వచింపు" మంచు నా
మతకరి పాడు కుబ్జ బతిమాలితిఁ, జేతులుఁ బట్టి వేఁడితిన్

ఎప్పు డో విస్మృత మైన శంబర సమిద్వృత్తాంతమున్ సర్వ మ
ప్డప్పు డే జ్ఞప్తికిఁ దెచ్చి యప్రతిహ తోపాయమ్ము సూచించె ని
ష్క్రప యై మంథర, త న్నిరంత సముద్యత్ప్రస్ఫూర్తియున్ దద్వచో
నిపుణత్వమ్మును నాది శేషునకు నేనిన్ వర్ణ నాఽసాధ్యముల్

తళుకుం భూషణముల్ త్యజించి కచ బంధం బూడ్చి చీనాంబరం
బులు వర్జించి వివర్ణ జీర్ణ వసనంబుల్ సుట్టి పెం జీఁకటుల్
బలుపుం గాంచిన కోప గేహమున నేలన్ వ్రాలి యీరేడు మూ
రల పెన్దుప్పటిఁ గప్పి మూలుగులు ప్రారంభించితిన్ మాయురే !

చిన్ని కుమారు రాము నభిషేక మహోత్సవ వార్త తానుఁగా
మున్నుగఁ దెల్పి మామక సముజ్జ్వల దాస్య సుధాంశు మండలిన్
వెన్నెల తేట లూరఁ గనుఁవిందుగఁ జూడఁగఁ దీఱుపాటు లే
కున్నను గాని వచ్చెఁ బ్రభుఁ డుల్లము తొందర పెట్టు చుండఁగన్

నేనో కోప గృహమ్ము నం దణఁగి యుంటిన్ నాదు దాసీ జన
శ్రేణుల్ సైతము స్వాగతం బిడ కుదాసీనత్వముం బూనఁగా
నానా రాజ శిరో విభూషణుల నాజ్ఞాపింపఁగాఁ జాలు నా
క్షోణీ నాయకుఁ డెంత తీవ్ర హృదయక్షోభమ్ము పా లయ్యెనో !

కల దానంద సుధాంబువుల్ గురియు మేఘుం బిచ్చటన్, దత్సుధా
జల ధారావళి నంతరంగమును సుస్నాతమ్ము గావించికో
వలె నంచుం జనుదెంచి తజ్జలద గర్భ మ్ముగ్ర నిర్ఘాత పం
క్తులకున్ దావల మౌట గాంచి మను జేంద్రుం డెంత గాసిల్లెనో !

కొలన విభాక రాంశుపులకున్ గిలిగింతలు వోవు తమ్మి పూఁ
బొలఁతికి మంద హాస మధుపుల్ ఋణ మిచ్చెడి నెమ్మొగమ్ముతోఁ
దొలఁకులు వాఱు క్రొంబెరిమతో నెదురేఁగుచు నుండు నన్ గ్రుధా
నిలయము లోనఁ జూడఁగనె నిల్వున నీ రయి పోయె గుండియల్

"సీమంతమ్ముఁ బయోధ రాంతర తటి౯చ్చీమంతముం దీసి హే
లా మందార సుమప్రశస్త మణిమాలా జాలముం ద్రోసి వే
ళా మాధుర్య మడంచి ముక్త కచమాలా బంధ వై కోప శా
లా మధ్యమ్మున జీర్ణ చేలమున నేలా నేలఁ బొర్లాడుటల్ ?

కోసల సార్వభౌము ననుఁగుం బ్రియురాలికి నేఁటికిం గ్రుధా
వాసము చేరఁగా వలసి వచ్చెనటే ! చిటిప్రేలఁ జూపినన్
దాసుని రీతి నౌదలను దాల్చి త్వదీప్సితముల్ ఘటింతునే
దోసము లేమి చేసితిని ? దొయ్యలి ! పూనితి వింత రోసమున్

అనయం బే రఘురాముఁ దావక బహిః ప్రాణంబుగాఁ జూచెనో
యనిశం బే రఘురాము నభ్యుదయ దీర్ఘాయుష్యముల్ గోరెనో
ఘనుఁ డా శ్రీరఘురాము మంగళ మహః కళ్యాణ కాంతిచ్ఛటల్
గన నీవున్ నిబి డాంధ కూపమున డాఁగం జూచు టబ్బం బగున్"

అనుచున్ భూపతి తత్తఱంపడుచు నావంతైన మాలిన్య మం
టని యచ్ఛం బగు నర్మిలిం జిబుక మంటన్ నేనయో ! తత్కరం
బును బల్మిన్ విదిలించి లేచి నయ నాంభోజంబు లంగారపుం
గణముల్ చిమ్మ విషోరగంబు వలె పూత్కారంబు గావించుచున్

"అవురా ! యేమి యుదారతా గరిమ, నీవా కోరికల్ తీర్చు వాఁ
డవు ? కొం కేటికి లేక పోయె నిటు లాడన్ నీ కయో ! పూర్వ ద
త్త వరమ్ముల్ నెఱవేర్పఁ జాలని మహోదారుండ వౌ నౌను క్రొ
త్త వరమ్ముల్ దయసేయు ! దెందులకు నాథా ! దంభ వాచాలతల్ ?

అల దేవాసుర యుద్ధ రంగమున మాయా రాక్షసుల్ పోవు పో
కలకున్ వాఁడిమి పెంపునం దగు ప్రతీకారమ్ముఁ గావించి నం
దులకున్ మెచ్చి వరద్వయ మ్మొసఁగి యెన్నో యేండ్లుఁ బూం డ్లైనఁ ద
త్ఫల పూర్తిన్ ఘటియింప విప్పటికి నాథా ! యెంత ధీరుండవో ! "

అని యిటు లేను నిష్ఠురము లాడఁగఁ బార్థివుఁ "డింత మాత్ర కే
వనితరొ ! కోప గేహమును బట్టఁగ నయ్యెన ? కోరి నప్పు డి
మ్మని కద ! నీవ యై పలికి తా దిన, మీ దిన మే నొసంగ లే
దని నిరసించు చుంటి వకటా ! యిది యెక్కడి వైపరీత్యమే ?

ఉవిదా! పోయిన దేమి ? నీ వరము లేహో కోరికొ మ్మిప్పుడే
రవి వంశాంబుధి పూర్ణ చంద్రముఁడు నా రామయ్య పై నొట్టుగా
భవ దాకాంక్షిత మెట్టి దైన నెఱవేర్పం జూతు, నిష్ఠ్యుకు భూ
ధవు లే నాఁటికి మాటఁ దప్ప" రని నిర్ద్వంద్వమ్ముగా వాకొనెన్

జనపతి నోట నీ గతి విచార విదూరత రాము మీఁద నొ
ట్టనియెడి పల్కు వెల్వడిన యంతన యెక్కడ లేని ప్రీతి సూ
ల్కొనియె, నభీప్సితమ్ము లొనగూడి నటుల్ పరితుష్టిఁ గంటి, నా
క్షణమునకే నిరీక్షణము సల్పితి నేనును వేయుఁ గన్నులన్

"శ్రీరామున్ మునిరాజ వేషమున నీరే డబ్దముల్ ఘోర కాం
తారం బందు వసింపఁ బంపుటయుఁ దత్ స్థానమ్మునన్ నా సుతున్
క్ష్మా రాజ్యాధిపు నాచరించుటయు నస్మద్వాంఛితమ్ముల్ ప్రభూ!
యీ రెంటిన్ నెఱవేర్చి నిల్పుకొను స్వామీ! నీదు వాగ్దానమున్"

మృదులత లేని భిన్న మొనరించిన నార్ద్రత కాస రాని యే
యదనున నైన సంచలన మందని కర్కశతా కరాళతా
స్పద పృథు లోప లోపమము స్వాంతము దారుణ పాప భీతికిన్
బెదరక నిల్వఁ గోరితిని బెట్టిద మైన వరద్వయ మ్మిటుల్

ముని వేషంబున రామభద్రుని వనీ భూమిం బ్రవాసింపఁగాఁ
జనుపంగా వలె నన్న పల్కు విష లిప్తం బైన క్రూరాస్త్ర మై
తన డెందంబున యందు నాటుకొని నంతన్ తేఁ డపస్మారముం
గని యెట్లో యొక కొంత తెప్పిఱిలి గాద్గద్యంబు సంధిల్లఁగన్

" ఏమి విచిత్రమో హతవిధీ! కల గాంచుచు నున్న వాఁడనా ?
యీ మెయిఁ గ్రోధ మూర్తి యయి యెట్టెదుటన్ నిలుచున్న దుత్తమా
గ్రామణి కేకయేశ్వరుని గర్భపు ముత్యపుఁ బంట కైక యే
నా ? మఱి కైక యైన నెటు లాడెడి నిట్టి కఠోర వాక్యముల్ ?

అనురాగ మ్మెద నిండి మెండుకొన వామాంకమ్ము నన్ జేర్చి గు
జ్జన గూళ్ళుం దినిపించి యూయెలలలోఁ జేపూర జోకొట్టి పెం
చిన లోకోత్తర మాతృమూర్తి సుగుణశ్రీధాము శ్రీరాముఁ గా
నన వాసమ్మున కంపఁగోరిన దటన్నన్ నమ్మ లే నింతయున్

భరతుని పట్ల నా యెడఁదఁ బాటిలు కూరిమి కల్మి యెట్టిదో
యెఱుఁగఁ దలంచి యి ట్లడిగి తేమొ తపోదరి ! కాక యున్న నీ
తెఱఁగున నీ హృదిన్ విశద దీధితులన్ విరఁజిమ్ము దీప మై
వఱలెడి రామమూర్తి నర వల్లభుఁ డౌటకు నొప్పకుందువే !

పరిహాసంబున కిట్లు పల్కితి పటే భామా శిరో రత్నమా !
పరిహాసంబున కైన వేళ గమనింపం బోలదే సుంతయున్ ?
దరియన్ వచ్చె శుభాభిషేక సుముహూర్త, మ్మెల్ల రచ్చోట నా
కొఱకై చూచుచు నుండ్రు పో వలయు వా కొమ్మి ! యథార్థం బిఁకన్"

అని నా మంచితనమ్ము నందు విభుఁ డత్యంతమ్ము విశ్వాస ముం
చిన వాఁ డై కడు దీనుఁ డై యిటులఁ బ్రచ్ఛింపన్ బ్రచం డాగ్రహ
మ్మున "రాజా! యిఁకఁ జాలుఁ జాలు నటనమ్ముల్ చాలు నెన్నాళ్లు నా
కనుఁ బ్రామం గల వయ్య ? యీ కపట వాక్చాతుర్యముం జూపుచున్

ఇచ్చితి వీవె మెచ్చికొని యే నయి కోరక మున్నె నాఁడు నా
యిచ్చకు వచ్చి నట్టి వర మెయ్యదొ కోరికొనంగ నేఁడు బే
ల్పుచ్చఁగఁ జూచు చుంటివి ప్రభూ ! యిది ధర్మమె ? యీఁ దలంచినన్
జెచ్చెఱ నిమ్ము ! లేని యెడఁ జెప్పుము ! లే దని విస్పుటమ్ముగన్

జలజాప్తాన్వయ మందుఁ బుట్టిన మహీశశ్రేష్ఠుఁ డాకాశ ముం
డల ముద్భేదిత మై పయిం బడిన బొంకం డంచు వాక్ప్రౌఢిమం
బలరన్ సత్యముఁ గూర్చి చేసితి వుపన్యాసం బహో ! వెఱ్ఱి బా
గుల దీ కైకయి యేవియో వెడఁగుఁ గోర్కుల్ కోరు నం చెంచితో !

మును సత్యవ్రత పాలనమ్మునఁ దృణమ్ముం బోలె సర్వస్వ మ
ర్పన గావించిన భాస్కరాన్వయ మహీ పాలాగ్రణుల్ చన్న దా
రిని వీసమ్మును దప్పఁ బో కమల కీర్తిజ్యోత్స్నికల్ నింతువో!
పని యే మున్నది మాటతో నని కులప్రఖ్యాతిఁ బోకార్తువో! "

అనుచుం గ్రూర కృతఘ్నురాల నయి నా యం దా మహీ నాథుఁ డుం
చిన విశ్వాసము మూలముట్టుగఁ బరిచ్ఛిన్నంబుఁ గావించి పా
యని విద్వేష రుషాతిరేకమున యుక్తాయుక్త సమ్యగ్విచ
క్షణముం గోల్పడి యీసడించితిని మూర్ఖత్వంబు రెట్టింపఁగన్

క్రూరత లేని సాధు వగు గో వనుచుం దలపోసి ప్రేమ పెం
పారఁగఁ బెంచి నిర్భయతఁ బార్శ్వము లందుఁ జరించుచుండఁగా
దారుణ గర్జనధ్వను లుదగ్రత సల్పఁ దొడంగి వ్యాఘ్రి నై
మాటి పయిం బడం గని క్షమాపతి దిగ్భ్రమఁ జెంది ఖిన్నుఁ డై

" ఎన్నఁడు నప్రియం బనున దించుక వెల్వడి యుండ నట్టి నీ
పున్నెపు నోట నీ యశుభముల్ హృదయప్రవిదారకమ్ము లో
యన్నుల మిన్న! నిర్గతము లౌట గనుంగొన నయ్యె నేఁటి క
న్నన్న! యి దేటి కర్మమె? గ్రహ మ్మెది యైనను నావహించెనా?

కైకేయి

నిజమా రత్నకిరీటమున్ విడిచి మౌనిస్వామి చందమ్ము దోఁ
ప జటాజూటముఁ దాల్చి కానల వసింపం బోవలెన్ గోసల
ప్రజలన్ వీడి కకుత్థ్సవంశ వరహీరం బంచు వాంఛింపుటల్ ?
నిజమా నీ మది నింత చెడ్డ తలఁపుల్ నిండారి యుప్పొంగుటల్ ?

క్షణకాలం బతఁ డక్షియుగ్మమునకుం గన్పింప రాకున్న " నా
యనుఁగుం బుత్త్రుఁడు లోకపావనుఁ డయోధ్యారాముఁ డెచ్చోటికిన్
జనెనో కన్గొని రండు ! పొం !" డనుచు దాసశ్రేణిఁ బుత్తెంచు నా
యనురాగమ్ము సమస్త మింతకును మాయానాటక మ్మౌ నటే ?

ఎక్కడి రామభద్రుఁడు మహిష్ఠ విశిష్ట గుణాళి కెల్లఁ దా
నిక్కువ, యక్కుమారవరుఁ డేలిక యైన సపూర్వ మైన పెం
పెక్కెడిఁ గోసలం బని యనేక విధంబుల నాడుచుండు నీ
కక్కట ! యీ నికృష్టపు దురాశయ మెట్లు జనించెనో కదే !

దూతలఁ బంపి నీ సుతునిఁ దోడ్కొని వచ్చి సమస్త కోసల
క్ష్మాతలికిన్ నృపాలకుని సల్పి త్వదీప్సితమున్ ఘటింతు, శో
కాతురుఁ డైన యీ దశరథాధిపు విన్నప మాలకించి యా
పూతచరిత్రు రాము వనభూముల కంపు తలంపు మానవే !

భరతుని పట్ల రాము నెడఁ బాటిలు నచ్చపుఁ బేర్మి యంచు నీ
వెఱుఁగుదు, వైన నాతఁ డెపు డేని భవత్సుతు నడ్డగించు నన్
వెఱ పది యున్న నీ దినము నిండు సభన్ బ్రకటింతుఁ గోసలో
ర్వర నిఁక రామచంద్రునకు స్వామ్య మొకింతయు లేక యుండఁగన్

భరతుఁడు యోగ్యుఁ, డాతని స్వభావము సాధుతమమ్ము, సోదరున్
బొరయఁగ నైన రాజ్యమును మోఱకురాలవు నీ యనుజ్ఞలన్
శిరమునఁ దాల్చి కైకొనెడి చెన్నఁటి గాఁడు సుమీ! తుదిన్ దిర
స్కరణ మొకండె నీ కగుట సత్యము సూర్యకులాపచారిణీ!

జలములఁ బాసి మీన మొక చక్కని బ్రాణము తోడ నిల్చినన్
నిలువఁగ వచ్చుఁ గాని మహనీయ మనోహర దివ్యమూర్తి ని
ర్మల సుగుణార్ణవుండు రఘుమండనుఁ బాసి నిమేష మేనియున్
నిలువఁగఁ జాలఁ డీతఁ డని నీవు నెఱుంగవె? దుర్విచారిణీ!

అనుచున్ ఱేఁడు విషాదభార వివశుం డై "రామ! హా రామ!" యం
చును జేదోయి శిరమ్ము బాఁదుకొనుచున్ శోకించి శోకించి యొ
య్యన మూర్ఛాగతుఁ డయ్యె, నిశ్చల నిరీహం బైన నేత్రద్వయిన్
గనుచున్ నిల్చితి నట్లె యే నచలితగ్రావమ్ము చందమ్మునన్

అది మృదు చంద్రకాంత శిల యైన రసోత్కట గీతమాలకుం
గదలి కరంగుఁ గాని మఱి కర్కశకర్కర మైన నెన్ని యేం
డ్లెదుటను నిల్చి సంతత మహిష్ఠ మనోహర గీతికా సుధా
మధు రస మెంత వోసిన సుమంత చలించునె ? చెమ్మగిల్లునే ?

అట నభిషేక మంటపము నందు సమస్త జనమ్ము గూడి యు
త్కట కుతుకమ్ము తోడ రఘుదైవము మూర్ధము నందు రత్న సం
ఘటిత కిరీట మచ్ఛతర కాంతు లవారిగఁ జిమ్ము నా పరి
స్ఫుట శుభలిప్తకై యెదురు సూచుచు నుండెఁ బ్రఫుల్ల నేత్ర మై

సుముహూర్తం బది డాసినన్ దశరథక్షోణీశుఁ డేతెంచు చి
హ్నము లే మేనియుఁ గానిపింపక కలంతం జెంది తేజస్సము
ద్రమ యై వెల్గెడి శ్రీ వసిష్ఠ మునిమూర్ధన్యుండు పుత్తెంచె మం
త్రిమణిన్ బావను నా సుమంత్రుని ధరిత్రీనేతఁ గొంపోవఁగన్

పిలువన్ వచ్చిన మంత్రిసత్తమున కుర్వీజాని యాకంత మ
గ్గల మౌ దుఃఖ భరమ్ముచే నెదియుఁ బల్కన్ లేక మౌనమ్ముగా
నిలిచెన్; "రాముని కేదియో తెలుప నెంచెన్ స్వామి యవ్వాని నిం
దులకుం దోడ్కొని రమ్ము పొ" మ్మని సుమంత్రుం బుచ్చెతిన్ ధూర్తనై

అవసర మేమిటో పిలువ నంపెను దండ్రి యటంచు నా రఘు
ప్రవరుఁడు మంత్రి వెంటఁ బడి పర్వున నా గృహ మేఁగుదెంచె; ను
త్సవమున కాజ్ఞ యిచ్చిన ప్రసన్నముఖమ్మునసే భయంకరా
టవులకు నేఁగ నాన తిడుటం దలపోయఁడు "పాప" మింతయున్

చరణాబ్జమ్ముల నంటి రాముఁడు నమస్కారమ్ము గావించినన్
నరనాథుం డఱకంటనుం గనఁడు, నిన్నన్ నిండు దర్బారులో
ధరణీంద్రుం బొనరించు వాఁడ నని యుద్ఘాటించి యే రీతి భీ
కర కాంతార నివాస మేఁగు మని యాజ్ఞాపించు నేఁ డింతలో ?

పలపల తెల్లవాఱు పిదపన్ గమనీయ కళా విహీన మై
వెలవెలఁబోవు శీతకర బింబ మటుల్ కరిణీ విధూత మై
యిల పయి వ్రాలి చెన్నడఁగు వృద్ధవటద్రుమ మట్టు లెంతయున్
బొలపముఁ దక్కి యున్న పిత మోముఁ గనుంగొని తప్తచిత్తుఁ డై

"జననీ ! నా పయిఁ బ్రాణముల్ విడుచు వాత్సల్యప్రథామూర్తి నా
జనకుం డియ్యెడఁ గన్ను లెత్తియును నా చాయన్ విలోకింప నొ
ల్లని నేర మ్మేది చేసి యుంటి ? నొక వేళన్ నీవు గుర్తించి యుం
డినచోఁ దెల్పుము దిద్దుకొందు " నని వేఁడెన్ నన్ను దీనమ్ముగన్

ఆ సుకుమార సుందర ముఖాంబుజముం దిలకించి సంత రా
కాసుల కేనియుం గరుణ గల్గుఁ, గఠోరత సన్నగిల్లు, నీ
ర్వ్యాసము పేత మామక హృదంతర మా వదనావలోకనన్
వీసము మార్పు సెందక ద్రవింపక నిల్వఁగ వీతలజ్జ నె

“ భరతుని యౌవరాజ్యపదభద్రు నొనర్పఁగ నిన్నుఁ గాననాం
తరమున మౌనిగాఁ బదియునాలుగు వర్షము లుండఁ బంప శం
బరు నెదిరించి నందుకుఁ గృపాపరుఁడై యిడి యున్న తత్పురా
వరముఁ బురస్కరించుకొని పార్థివుఁ గోరితి నీ దినమ్మునన్

నిను విడనాడి లిప్తయును నిల్వఁగఁ జాలని వత్సలత్వమున్
వనజహితాన్వయమ్మునకు వాసి ఘటించిన సత్యవాక్య పా
లనమును దేని కయ్యదియె లావయి చిత్తము క్షోభ పెట్టి మున్
వెనుకల కీడ్చుచుండఁ బృథివీపతి వాకొనఁ జాలఁ డేదియున్

అగు నగుఁ గాక నీకు నిది యప్రియ, మైనను బల్కి బొంకుటల్
తగ దని యాలుబిడ్డలను ద్యాగ మొనర్పఁగ నేర్చి నిర్మలం
బగు చిరకీర్తి గాంచిన నృపాగ్ర్యుల కోవను నీదు తండ్రిఁ జే
ర్పఁగఁ దలపోసినన్ బదులు పల్కక పట్టు మరణ్య మార్గమున్ ”

అనియెడి మర్మభేదకము లప్రియముల్ మదుదగ్రవాక్యముల్
వినియు రఘుప్రకాండు ముఖ బింబము నందు వికార మింతయున్
గనుపడ, దేదియో నవవికాసము మంజుల మందహాసమున్
బొనరఁగ మంచి ముత్యములుఁ బోని వచస్సువిలాస మొప్పఁగన్

" ఇది నా కప్రియ మేల కా వలయుఁ దల్లీ ! సద్గుణశ్రేణికిం
గుదురౌ తమ్ముఁడు భద్ర పీఠమున వెల్గొందన్ సమీక్షించి స
మ్మద బాష్పమ్ములు రాల్ప లేని యొక దుర్మార్గుం డటే రాఘవుం ?
డెదు రొక్కింతయు లేక నీ సుతుఁడు హాయిన్ గోసలం బేలుతన్ !

వనవాసంబు విచారహేతు వనుచున్ భావింపఁగా రాదు, స
న్ముని సందర్శన భాగ్య మీశ్వర పదాంభోజాత చింతా సమ
ర్చనలం గాలము వెళ్ళఁ బుచ్చు నవకాశ మబ్బు నచ్చో, మను
ష్యునకున్ ధారుణి నింత కంటె నిఁక సద్యోగంబు వే యుండునే ?

ఎందుల కింత మాత్రమునకే జనకుండు విషణ్ణచిత్తుఁ డై
కొందల మందుటల్ ? వనులకుం బయనం బయి పోదు నీ తృటిన్
వందిత నిర్జరేశ్వరుఁడు నా పిత కీర్తికిఁ గప్పురంపు ట
చ్చందనమున్ ఘటించి సువిచారిణి ! తీర్చెద నీ యభీష్టమున్ "

అని యిటు లా యనూన సుకృతాకృతి యెంతయు నిశ్చలమ్ముగా
ననియె; సుధారసమ్ము నినుపారిన పాత్రిక నోటి కంది వ
చ్చిన దయి చేయి జాఱి పడి చిందఱ వందఱ యైన నింతయుం
దొనఁకక నిల్చు నా హృదయతోయధి యెంత గభీరధీరమో !

నాకున్ రాముని కైన భాషణము సొంతమ్ముల్ శ్రవోయుగ్మమున్
దాఁకెన్ గాని యిలాతలేంద్రుఁ డెదియున్ మాటాడ నోపండు; క్షో
భాకంపమ్మునఁ దెల్వి దప్పి యసహాయావస్థ పాలైనచో
మూకీభావముఁ బూన కెవ్వఁ డధరమ్ముల్ విప్పఁగాఁ జాలెడిన్?

" అనిలున కందరాని జవనాశ్వములం గొని దూత లిప్పుడే
చన వలెఁ గేకయేశ్వరుని సన్నిధికిన్, వెనువెంటఁ దమ్మునిన్
గొని చనుదెంచి రాజ్యమునకుం బతిఁ జేయ వలెన్, వృథా విలం
బన మొనరింప నేటి " కని పల్కిన ధీమతి రామమూర్తికిన్

" ధరణిపు నాన నీ యనుఁగుఁ దమ్మునిఁ దోడ్కొని రా గిరివ్రజ
మ్మరిగెడి వారు దూతలు రయమ్మున, నైనను వాఁ డయోధ్యనున్
దరిసెడి దాఁక నీ కిచటఁ దాళఁగ నేటికిఁ ? గాన కట్టులున్
దరలఁగ నిశ్చయించుకొనినాఁడవు గావున నేఁగుమీ ! వెసన్

ఓ రఘురామ ! నీ వికఁ నయోధ్యఁ దొలంగి యరణ్యసీమకుం
జేరెడి దాఁక స్నానమును జేయఁడు, భోజన మొల్లఁ, డీ వ్యథా
భారము డింప నోపఁడు నృపాలుఁడు; గావున వేగిరంబ కాం
తార పథమ్ముఁ బట్టు " మని దౌష్ట్యము ధౌర్త్యము మీఱఁ బల్కితిన్

రసఁబడు పూల బాటలను గా లిడఁ బోవక ముండ్ల బాటలన్
జను మని యాన తిచ్చిన నృశంసకు నాకును సర్వమున్ వినీ
విన నటు మిన్నకున్న పృథివీపతికిన్ వినయాఢ్యుఁ డై ప్రద
క్షిణ మొనరించె నా సుగుణసేవధి యెంతటి శాంతమూర్తియో !

" అరిగెద నీ దినంబ భవదాజ్ఞ శిరంబునఁ దాల్చి తల్లికిన్
దరుణికిఁ దెల్పి పోవ వ్యవధాన మొకింత యొసంగు " మంచు నన్
గరములు మోడ్చి వేఁడె రఘుగణ్యుఁడు; తా నొక మానవాకృతిన్
ధరణికి డిగ్గి వచ్చిన నితాంత తితిక్షయె గాక వే ఱొకో!

ద్వారము నందు నిల్చి కను లార్పక యంతయుఁ జూచుచున్న దు
ర్వార బలుండు లక్ష్మణుఁడు ప్రాన్పడి నిల్చె విశాల లోచనాం
భోరుహ యుగ్మ మందు జలపూరము లూరఁగ సుందరస్మితాం
కూరము లాఱఁగా నసల గోళమ యై మొగ మెఱ్ఱఁబాఱఁగా

ఎందు నధర్మ మించుక సహింపఁగఁ జాలని యా సుతుండు నా
చందము దుర్యశస్కర మసంగతమున్ దిలకించి క్రుద్ధుఁడై
కొందల మందియుం బలు కొకొందును బల్కఁడు, మంత్రవృద్ధ నా
గేంద్రుని యోజనై రఘుకులేంద్రుని వెంబడిఁ బోయె మెల్లనన్

అనితర లభ్యమైన విపులాఖిల కోసల రాజ్యలక్ష్మిఁ జే
కొనఁ జనుదెంచుచున్ జనని కోమల పాదము లంటి మ్రొక్కి దీ
వనల శుభమ్ము లందఁ దగు వానికిఁ గానల నుండఁ బోవఁగా
ననుమతి వేఁడఁగా నయిన నా హృదయ మ్మెటు లెంత క్రాఁగెనో !

ఈ సువిశాల కోసల మహీవలయాధిపుఁడై సువర్ణ సిం
హాసన మెక్కఁ బోవుచు నిజాశిష సమ్మతులన్ గ్రహింప వేం
చేసెడి రామమూర్తి యని చిత్తమునం దలపోసెఁ గాని యా
కోసల రాజపుత్రి యొక కొంచె మెఱుంగ దరణ్య మేఁగుటల్

"భరతుఁడు యౌవరాజ్య పదభద్రుఁడు గాఁ గలఁ, డేను గానలన్
దిరుగఁగఁ బోదు నన్ననుమతింపుము కా దనఁ బోకు" మంచుఁ దాఁ
జరణము లంటి వేఁడి పెలుచన్ హృదయమ్మునఁ జిచ్చు వెట్టు సం
చెఱుఁగదు, స్వప్న మం దయిన నింతటి దుర్గతి నెంచ దెప్పుఁడున్

భరతుఁడు దుర్గమాటవులఁ బట్టక తప్పు దటన్న మాత్రనే
కలఁకుఁ గటారి నా హృదయకంజమునన్ నటన మ్మొనర్చెనే
వరగుణరాశి యౌ ననుఁగుఁ బట్టి నిజమ్ముగ ఘోర కానన
మ్మరుగుటఁ జూడ నామె హృదయమ్మున నెన్ని ఖరాసు లాడెనో !

కోసల రాజపుత్రి కనుఁ గోసల నశ్రులు నిండఁ జూచి పెన్
గాసిని జెంది యంత దనుకన్ రఘునాథునకుం దలంకి యె
ట్లో సయిరించి నో ర్మెదప కూర్పులు వుచ్చుచునున్న మా సుమి
త్రా సుతుఁ డొక్కసారి వెలిగ్రక్కిన వాఁ డఁట కోప మంతయున్

తన కోదండ కళాప్రవీణత నిలన్ ధర్మంబుఁ గాపాడఁగా
వినియోగింపఁగ దీక్షఁ బూనిన మహా వీరుండు సౌమిత్రి న
న్నును నా కడ్డము వచ్చు దుష్టజనసందోహంబుఁ దున్మాడఁ జా
లిన వాఁ డయ్యును మిన్నకుండె – రఘుమౌళిం జూచి శాంతించెనో !

ఎంతటి నీచురా లయిన నెంతటి దూషిత శీల యైన నిం
కెంతటి క్రూరురా లయిన నెంతటి దుర్గుణ జాల యైన స్త్రీ
సంతతు చెంత కంపఁ దగ, దంపినఁ గిల్బిష మంటు నంచుఁ దత్
స్వాంతము నందు నూల్కొని యధర్మ భయ మ్మది నిల్వరించెనో !

ఇంతటి కష్ట నష్టముల కెల్లను గారణ మైన దాని దు
ర్దాంత దురంత ఘోర దురితమ్ముల ప్రోవగు దాని నెత్తుటన్
సుంత పరిప్లుతం బయిన శూరుల నోర్చు పవిత్ర మైన వా
లెంతయు నప్రపూతమును హేయము గాఁ గల దంచు జంకెనో!

"హృదయాధీశ్వరి! వల్కలాజినము లర్థిం దాల్చి యుగ్రాటవిన్
బదునా ల్గేండ్లు చరింపఁగా జనకుఁ డాజ్ఞాపించె, నే మాత్రమున్
మదిఁ జింతింపకు పోయి వత్తు" నని రామస్వామి వాక్రుచ్చి నం
త ధరిత్రీసుత గుండెలోన సుడిగుండా లెన్ని రేకెత్తెనో!

"పుడమిం బాదము లూఁదినం గములు పూవుంబోణి వౌ నీ పటే
యడుగున్ మోపఁగ రాని కంటక యుతం బౌ కాననాధ్వంబులన్
నడువన్నేర్తువు? మాను మీ జతన" మన్నన్ మానఁగాఁ బోని యా
దృఢదీక్షాపరురాలు భూమిసుత భర్తృప్రేమ యే పాటిదో!

"రాముఁడు క్రూరసత్త్వ నికరమ్ముల మధ్యఁ దపించుచుండఁగాఁ
గామక తత్పవిత్ర పదకంజములన్ భజియించు లక్ష్మణుం
డే మెయి నాప్త బాంధవ సుహృత్తతిఁ గూడి సుఖించు? నన్నుతో
బాముల నోర్చు వాఁడ" నని పైపము గట్టె సుమిత్ర పట్టియున్

మొనసి జనప్రకీర్ణ పథమున్ సుగమ మ్మొనరించుచున్ భటుల్
మునుకొన జాతి గుఱ్ఱములఁ బూన్చిన మేలి పసిండి తేరిపైఁ
జనఁ దగు రాఘవుం డనుఁగుఁ జానయుఁ దమ్ముఁడు పాదచారులై
వెనుకొని రాఁగ నట్టనడివీథిని నా గృహ మేఁగుదెంచెఁ దాన్

" జనకా ! యాడిన మాటఁ దప్పు కునికిన్ సర్వస్వమున్ ధార వో
యను వెన్కాడని సత్యసంధు లుదయ ప్రాగ్భాను వంశమ్ము నన్
మణి పై పుట్టిన నీ యశం బినుమడింపం జేయుఁగాఁ గానకున్
జని వత్తున్ సెల విమ్ము ! నాకు " నని విజ్ఞాపించెఁ దా నమ్రుఁడై

తన ప్రాణమ్ముల లోని ప్రాణ మగు పుత్రశ్రేష్ఠుఁ డుగ్రాటవిన్
జన సిద్ధంపడి " పోయి వత్తు సెల " వన్నన్ " బోయి ర " మ్మంచు నే
జనకుం డింతయు వ్యాకులంపడక యాశాసింపఁగా నేర్చు ? మె
త్తని యంపమ్మున గర్భముం దఱుఁగు చందం బై విలాపింపఁడా ?

" నా వెలి ప్రాణ మైన రఘునందన ! మాలిమి మాలు నా యను
జ్ఞా వశవ ర్తనమ్ము విడనాడి జగత్ప్రతిపన్న విక్రమ
శ్రీ విభవమ్ము నన్ గుజన శేఖరు నన్నిఁక నిగ్రహించి భూ
మీ వలయమ్ము నేలుకొనుమీ ! జను లెల్లను నుల్లసిల్లఁగన్

చతురంగప్రయుతమ్ము లైన చమువుల్ సర్వప్రజాసంతతుల్
వితతాగణ్య ధనోత్కరమ్ముఁ గొని వేవే పైన మై జానకీ
పతి వెంటన్ విపినమ్ము లేఁగ వలె, నాపై శూన్య సాకేతమున్
సుతుఁడుం దానును గూడి యేలుకొన వచ్చున్ నిర్విఘాతమ్ముగన్ "

అని యిటు లమ్మహీరమణుఁ డాడఁగఁ " గానలకుం బ్రవాసియై
చనియెడి వాఁ డెవం డయిన సర్వ పరిజనమున్ జమూతతిన్
గొని చనువాఁ డొకో " యనుచుఁ గూసితి సిగ్గఱి, యంత తేని క
న్గొనల సస్ఫుక్సముద్రములు ఘూర్ణిలినం గని రాముఁ డిట్లనెన్

" అవు నవు నయ్య ! అమ్మ కయికమ్మ వచించిన దక్షరాల వా
స్తవము, వర మ్మొసంగిన నొసంగ వలెన్ గ్రమ మింత తప్ప, కీ
పవిది నొనర్తు వేని నిరవద్యము తావక సత్యసంధతన్
మిపులఁ గళంక మంటుఁ, దగునే ? యిది సూర్యకులమ్ము వారికిన్

సీతయు లక్ష్మణుండు వనసీమకు వచ్చుట కైనఁ గైకయీ
మాతయు నొప్పుకో వలయు, మాలిమిఁ జూపక యొప్పకుండినన్
సీతయు లక్ష్మణుం డిచటనే నిలువం దగు వారు సుమ్ము ! సా
కేతము వీడి పోఁ గలఁడు " కి " మ్మన కీ రఘురాముఁ డొంటిగన్"

అంతటి శాంత మంతటి నయజ్ఞ త యెందును జూడ నే ర్తుమే ?
అంతటి ధార్మికో త్తమున కక్కట ! మానవరూప దానవిన్
సుంతయు లజ్జ లే కెవరొ జోగులు దాల్చెడి నారచీర ల
త్యంతము దుర్ధరమ్ము లగునట్టివి చేకొని వచ్చి యిచ్చితిన్

ఒక సవనాగ్ని కుండమున నుండి బయల్పడి యజ్ఞపూరుషుం
డకాయుష మైన పేర్మి నిడు యజ్ఞఫలం బటు స్వీకరించి యిం
పకయు విచార హీనాన కనుజంయును దానును క్షత్రియోచితాం
శుకము లమూల్యముల్ విడిచి చుట్టిరి యే నిడినట్టి వల్కముల్

తాఁకినఁ గందిపోయెడి లతాంత మృదూజ్జ్వల మైన మేన వే
రూకల విల్వ సేయు నపురూపపు జిల్గుఁ బసిండి చీర నా
జూకుగఁ జుట్టు నా జనక సూతికి దుప్పటి కంటె నెక్కుడౌ
తూకము గల్గు వల్కలము దుర్భర మెట్లు ధరింప నయ్యెడిన్ ?

" పాపము " నారచీర నొక పట్టునఁ గట్టఁగఁ జేత నైన తం
టా పడి చేతఁ గా కవనినందన నివ్వెఱఁ గంది " వీనినిన్
దాపస కన్య లే కరణిఁ దాల్చెడి వా " రని పృచ్ఛ సేయ నా
ధీపరిణద్ధమూ ర్తి రఘుదేవుఁడు తా నయి కట్టఁ బోవఁగన్

కైకేయి

కడఁకన్ లోన నడంచుకొన్న యతిరేకంబైన దుఃఖార్ణవం
బడఁపం బోలని పొంగులై పొరలి రా నంతఃపురస్త్రీజనం
బడలెం గంటికిఁ గంటికిం గడవెఁడై యుగ్రూహదరం బూరఁగాఁ
బడఁతిం జేకొని పోకు మంచుఁ గొడుకుం బ్రార్థించె నొక్కమ్మడిన్

సీతకు రాముఁ డా ముదుగుఁ జీరను గట్టఁ గడంగి నంతటన్
జేత మదెంత వ్యాకులతఁ జెందినదో గురుమౌళికిన్ గుణ
వ్రాతము రాము చేతఁ గల వల్కలమున్ వెస లాగివైచి దు
ర్నీతికిఁ బాలుపడ్డ యవినీతను నగ్గని యుగ్రమూర్తియై

" కైకా ! రాఘవు లింటి కోడలికి నీ కార్యంబు సంభావ్యమే
శ్రీ కళ్యాణ గుణాంబుధుల్ జనకజాశ్రీరాము లవ్వారిపై
నీ కాఠిన్యము నీకునున్ సముచితంబే ? వంశ మర్యాదనున్
బోకార్పన్ సమకట్ట" కంచు హితవున్ బోధించె పల్భంగులన్

ఒక గురుదేవుఁ డేమి సచివోత్తముఁ డల్ల సుమంత్రుఁ డాదిగా
సకల సుధీశిరోమణు లజస్రము సూర్యకులమ్ము పెంపునే
యకుటిల బుద్ధిఁ గోరెడి హితైషులుఁ జెప్పిరి, కాని వారి యం
దొకరి వచస్సునున్ శ్రవణ యుగ్మముఁ జేర్పఁగ నైతి దుర్మతిన్

కొడుకులు కోడలున్ జిలుఁగుఁ గోకలు విప్పి దరిద్రులం బలెన్
దడసరి నారచీరలను దాల్చి సమక్షము నందు నిల్వఁగా
నొడయఁడు చూడ లేక తల నొయ్యన వంచె విషాద బాష్పముల్
జడిగొనుచున్న కన్నుఁ దొవలన్ ముకుళించి శుచా విదీనుఁడై

"తల్లికి లక్ష్మణుం డడుగుఁ దామర లంటి నమస్కరింపఁగాఁ
జల్లఁగఁ బోయి రమ్ము రఘుచంద్రుని వెంబడిఁ, దమ్ముఁగుఱ్ఱ కీ
యెల్ల జగమ్ము హారతుల నెత్తెడి యన్న పదాంబుజంబు లు
త్ఫుల్ల మనంబునన్ గొలువఁ బూనుట కంటెను గార్య మున్నదే ?

సీతారాములె తల్లిదండ్రు లని నిస్సీమం బరణ్యంబె సా
కేతం బంచుఁ దలంచి యేమఱక భక్తిశ్రద్ధ లేపారఁగా
సీతారాములఁ గొల్చుచుండు" మని యాశీర్వాదమున్ జేసె శో
కాతంకమ్ములు లేక యాయమ – తదీయస్థైర్య మేపాటిదో !

తుది పర్యాయము గాఁగఁ దల్లులకుఁ జేతుల్ మోడ్చి తన్మంగళ
ప్రదముల్ దీవన లంది "భూరి కరుణార్ద్రస్వాంతవై నీవు నె
మ్మది దీవింపకయున్నఁ బో" ననుచు నస్మత్పాదముల్ పట్టి తా
వదలం డెంతకు రాముఁ డందఱ కతీవం బైన యబ్రంబు గాన్

అప్పటి కైన మెత్తవడ దయ్యెను నా మది " తండ్రి యానతిన్
దప్పక కాన లందుఁ బదునాలుగు వర్షము లుండి రమ్మురా !
యిప్పృథివీతలం బనుజుఁ డేలుకొనం గలఁ " డంటి నెల్ల వా
రిప్పలుగాకి మోముఁ గనుటే దురితం బని యీసడింపఁగన్

జనపతి పంపునన్ సచివసత్తముఁ డల్ల సుమంత్రుఁ డేఁగి కాం
చన మణి మండితం బయిన స్యందనముం గొనివచ్చె రామ ల
క్ష్మణులకు గున్నముల్ వెదురుగంపలు నైకవిధాయుధమ్ములున్
జనకజ కాణిముత్యపు స్రజమ్ములు గుట్టలు వెట్టి క్రచ్చఱన్

మూవురు తేరిపై నడుగు మోపిన యంతన గాయనీ గళా
రావములున్ శుకీ మధురరావములున్ గమనీయవాద్యసం
రావములున్ సదా మొరయు రాజగృహమ్మున దీర్ఘరోదనా
రావము లెచ్చరిల్లి ప్రతిరావము లీనెను గాకి గోలయై

పురము పురమ్మె తల్లడిలి పోయె, రఘూద్వహు పట్టబంధన
మ్మరయఁగ వచ్చియున్న జన మంతయు నివ్వెఱపోయె, లోచనాం
బురుహ యుగంబులం దిమిరపుంజము గ్రమ్మని వారు గొంతు బొం
గురువడ నేడ్చి నెవ్వగలఁ గూరని వా రగుపింప రొక్కరున్

తెలిసిన మానవుల్ కలఁగి దీల్పడు టబ్బుర మేమి ? యేమియుం
దెలియని పక్షులుం బసులు దీనముఖంబులు మీఁది కెత్తి యే
డ్పులుఁ బెడబొబ్బలున్ సలుపఁ బూనెఁ జెవుల్ చెవుడొంద; సర్వ జీ
వుల కభిమాన పాత్రుఁ డయి పొల్చిన రాఘవుఁ డెంత పూజ్యుఁడో !

" నిలుపు సుమంత్రుఁడా ! రథము నిల్పు నిమేషము, రామమూర్తి మం
గళ మధుమూర్తి నొక్కపరి కన్గొన ని " మ్మని యార్తనాదముల్
సలుపుచుఁ బర్విడెన్ బ్రజ ప్రచండ నిదాఘమునం దృషాళువుల్
జలములకై జలాశయము చాయలకుం బరువెత్తు కైవడిన్

పమ్మిన దుఃఖభారమును బట్టఁగఁ జాలక " పూర్ణ చంద్ర బిం
బమ్మును గ్రేణిసేయఁ గల భానుకులాభరణమ్ము నాస్య బిం
బమ్మును జూడఁగా వలయు బ్రాఁతిగ " నం చొక పిచ్చివాని చం
దమ్మునఁ బర్విడెన్ నృపవతంసుఁడు కోసల కన్య వెన్కొనన్

వచ్చెడి తల్లిదండ్రులను బాహుయుగమ్ములు సాఁచి " గుండెలన్
జిచ్చు రగిల్చి పోవఁ దగునే " యని యేడ్చుచుఁ బర్వు పర్వునన్
వచ్చెడి దీనులం గనియు వాఁడిమి పోఁడిమి గల్గు శూలముల్
గ్రుచ్చిన యట్టులయ్యు రఘుకుంజరుఁ డెట్లు సహింపఁ గల్గెనో !

" ఆఁగిన సాగఁ బోవదు ప్రయాణము, చేసిన బాస వ్యర్థమై
పోఁ గల, దాత్మ లోన నొక మూల నడంచిన చింత క్రమ్మఱన్
మూఁగు " నటంచు నా సుకృతపూర్ణుఁడు లోనఁ దలంచె నేమొ తా
నాఁగక లిప్త మాత్రమును స్యందనముం జననిచ్చె ధీరుఁడై

" హా తండ్రీ ! రఘురామ ! రామ ! " యని హాహాకారముల్ సేయుచున్
వీతస్థైర్యుఁడు కుప్ప గూలి స్మృతి దప్పెన్ ఱేఁడు, తత్రత్యులు
ద్ధూతస్వాంతులు శ్రీ వసిష్ఠులును మంత్రుల్ తెచ్చి ప్రాసాద వే
దీ తల్పంబునఁ జేర్పఁ గొంతవడి కొందెన్ స్మారకం బెట్టులో

పరిచర్యా పరతంత్రనై తనదు పార్శ్వం బందు నిల్చున్న న
న్నరకంటం దిలకించి రక్త నయనుండై " నీ కరస్పృష్టి నీ
వఱకే దూషిత మైన నా యొడలు పాపస్థానమా ! యింకనున్
బరమోదగ్ర కళంక దూషిత మొనర్పం బోకు " మం చార్చుచున్

నను విడనాడి లిప్త యయినన్ మనఁ జాలని స్వామి నాదు ద
ర్శనమె దురంత పాతకకరం బని నా భవనంబు వీడి క్ర
న్ననఁ జనెఁ బెద్ద రాణి సదనంబునకున్ బరిచారకావలం
బనమున లేచి లేచి నిలువం బడ నైనను శక్తి హీనుఁడై

ఒక యనివార్య మైన పని యుండి విరామ మొకింత యైనఁ జి
క్కక ననుఁ జూడ రాని యెడ గాసిలుచుండెడి దాన నాఁడు నా
మొకమును జూడ రా దని విభుండు కనారిలుచున్ సపత్ని యిం
టికిఁ జనుచుండుటం గనియు నిల్చితి నోడక నిశ్చలమ్ముగన్

అంతము లేని నిర్భర శుచాంబుధి మున్కలు వేయుచున్న భూ
కాంతునిఁ బెద్దరాణి నొక గట్టునఁ జేర్ప సుమిత్ర తెప్పయై
యెంతయు నాదుకొన్న దఁట యెక్కడి ధైర్యమొ! తాను గూడ దు
ర్దాంత నిరంతరప్రియసుతప్రవియోగవిషణ్ణ యయ్యునున్

ఆ రఘువంశరత్నముల నా గుణసాంద్రుల నిర్జరాపగా
తీరము నందు డించి చనుదెంచె సుమంత్రుఁడు రాజధానికిన్
దేరు మరల్చుకొంచు రవిదేవుని దర్శన భాగ్య మెంతయున్
దూరము సేయఁగాఁ బడిన తోయజమున్ బురుడించు మోమునన్

అట గుహరాజు భక్తిభరితాత్ముఁడు తెచ్చిన మఱ్ఱిపాలతోఁ
గుటిల శిరోజముల్ మెలిచి కొంకక తాపసముఖ్యులం బలెన్
జటలు ధరించి దేవనదిఁ జయ్యన దాఁటి భయంకరాటవీ
జటిలపథమ్ము లంటి మును సాగిన వా రఁట బిడ్డ లక్కటా!

ఆ యకలంకమూర్తు లమరాపగ చెంత రథాపరూఢులై
పోయిన మంత్రిమౌళి రథమున్ మరలింపఁగఁ జూచి గుఱ్ఱముల్
మాయురె! ముందుకుం గదల మాని హఠమ్మొనరించె నంత చిం
తాయుత దీర్ఘహేషలకుఁ దత్సరిదుద్ఘము సంచలింపఁగన్

తా నొక కింకరుం డగుట ధారణి నాథుని యాజ్ఞ మీఱఁగా
రానిది గావుటం బురికిఁ గ్రమ్మఱి వచ్చుట తప్ప దయ్యెనే
కాని మఱొక్కఁడైన రఘుకాంతునిఁ గానల డించి గంగలో
నైనను దూఁకి ప్రాణముల నట్టె త్యజించెడి నంట తెంపుసన్

పచ్చిక బిట్టు దట్టముగఁ బట్టిన పచ్చ బయళ్ళ మేఁతకై
వచ్చుట మానె నంట పశువారము, వన్య మృగీమృగవ్రజం
బెచ్చట నే బిలమ్ములఁ దపించుచు నుండెనొ భుక్తి కోసమున్
వచ్చిన జాడ గూడఁ గనుపట్టఁగ లే దఁట కోసలాటవిన్

రాముఁడు జానకీసతి యరణ్యములం దిరుగాడఁ బోయి రే
లా మఱి పూవఁ గావఁగ నటంచు సమస్త లతావితానముల్
భూమిరుహప్రతానములు పూచుట గాచుట మాని దీనతా
ధామము లయ్యెనంట సముదార మనోహరతా నిధానముల్

తొలఁకులు వాఱు తీయనగు తోయములం జెలువొందు చెర్వులున్
గొలఁకులుఁ గూపముల్ నదులు కుంటలు సర్వము నిర్జలమ్ములై
తలములఁ బంక మాఱె నఁట, దప్పిని నాలుక లెండి ప్రాణముల్
వెలలిసఁ గాని యొక్క జలబిందువుఁ గన్పడ దంట యెందునున్

కనరా దంట మహీజశాఖల విహంగ మ్మొక్కఁడున్, సత్కృపా
ఖని శ్రీరాముఁడు లేని కోసల మహీఖండమ్మునన్ నిల్వ నొ
ప్పని వై రాముఁడు పోవు నయ్యడవి త్రోవం బట్టి యేతేరెనో
వనమం దై నఁ దదీయ శీతల దృగధ్వశ్రేణి వర్ధిల్లఁగన్

తానై కోసల సార్వభౌముల యమాత్యశ్రేష్ఠుఁ డుర్వీజన
శ్రేణీ నిత్యహితై షి యూళ్ళఁ బడి విచ్చేయన్ విలోకించి గ్రా
మీణుం డొక్కఁడు నాదరింపఁ డఁట, స్వామిన్ దించి వేంచేయు న
వ్వానిం జూచుట గూడఁ గూడ దనుచున్ భావించిరో! యెల్లరున్

సీతాలక్ష్మణసంయుతుం డయి రఘుశ్రేష్ఠుండు భాగీరథీ
స్రోతస్సుం దరియించి కాఱడవి దారుల్ వట్టె నన్ వార్త రఘుం
రఘూతీవ్రప్రవిఘాతమై తగుల లేశ మ్మోర్వఁగా లేక భూ
నేతృగ్రామణి నేలపైఁ బడియెఁ బెన్ వృక్షమ్ము చందమ్మునన్

కై కే యి

తలఁగని దీక్షతో నవిరతం బగు నోరిమితో వ్యయప్రయా
సలకుఁ జలింపఁ బోవక రసాతల మంటఁగ వజ్రపుం గనుల్
తొలువఁగ లభ్య మైన యతిలోక మనోహర హీరమున్ బ్రభా
కలితముఁ గాలఁ దన్ను కొని గాసిలునట్టి యభాగ్యుఁడుం బలెన్-

తానై నాటిన మల్లికాలతిక మోదశ్రీదమున్ బుష్ప సం
తానమ్మున్ విరఁబూచు వేళ కెదొ యున్మాదమ్ము వాటిల్లి తా
నై నీర్వోయక పెం పడంచి యటుపై నత్యంత చింతా ధురా
దీనుం డయ్యెడి తోటమాలి వలె ఖేదించెన్ విభుం డెంతయున్

అతితర పుత్రశోక భయదానలకీలలు రేఁగ నంతలో
స్మృతిపథ మందుఁ దేలిన మునీశ్వర దారుణశాపవృత్త ము
ద్ధత మరుదుగ్రవీచి యయి తజ్జ్వలనార్చులఁ జెల్లరేఁపఁగా
క్షితిపతి వ్రేఁగి వ్రేఁగి మృతిఁ జెందె నయో! పరిదీనమూర్తియై

తలఁచిన బొందితో నమరధామముఁ జేర్పఁ గలట్టి పుత్రకుల్
గలిగిన భాగ్యవంతునకుఁ గన్నులు మూసెడి వేళ గొంతులోఁ
దులసి దళమ్ముతో నమలతోయము వోసెడి వాఁ డొకండునున్
గలుగక దిక్కు లేని మృతిఁ గాంచెడి దుర్గతి పట్టె నక్కటా!

కనులన్ బాష్పజలస్రవంతిక లస్పృగ్జంబాలినుల్ సంభవిం
పని వా రంతిపురంబు నంద యని చెప్పన్ రాదు సాకేత ప
త్తనమందున్ సువిశాల కోసల సమ స్తక్ష్మాతలం బందునున్
గనరా రాదిన మే కెలంకునకు దృగ్జాలంబు సారించినన్

ప్రాణము వోయినంత దహనాదికముల్ సకలో త్తరక్రియల్
పూని యొనర్పఁ జెంత నొక పుత్రకుఁ డై నను లేక యుండుటన్
తేని శవమ్ము భద్ర మొనరించిరి క్రుళ్ళక యుండఁ దై లపుం
ద్రోణికలో నభిజ్ఞులు గురుప్రవరుండును మంత్రిమండనుల్

ఎన్ని వ్రతమ్ములన్ సలిపి యెంత తప మ్మొనరించి పుత్రులన్
గన్నను లాభమే మొదవె ? నల్వురు నందను లుండి కూడ లే
కున్న విధంబ యయ్యె, మృతి నొందిన తోడన సంప్రయు క్తమౌ
తెన్నున నగ్నిసంస్కృతులు దీరెడి యోగము గూడఁ గల్గదే !

మఱుసటి నాఁడె మౌనికులమౌళి వసిష్ఠు ననుజ్ఞ వొంది న
ల్వురు సుభటుల్ ప్రయాణముయి పోయిరి రాజగృహమ్ము, నిచ్చటన్
జరిగిన యీ విషాదకర సంఘటనమ్ములు తెల్పకుండనే
భరతుని వెంటఁ బెట్టికొని వచ్చి రయోధ్యకుఁ బర్వ పర్వునన్

రమణుఁడు లేని యంగన తెఱంగునఁ జంద్రుఁడు లేని రాత్రి చం
దమునఁ బురాకళా విరహితం బయియున్న పురంబుఁ జూచి స్వ
ప్నములు భయంకరమ్ము లశుభంకరముల్ గని లోన నెంతయున్
గుములుచునున్న నా కొడుకు గుండియ లెంతగ నూఁగిపోయెనో!

అరదము డిగ్గి తండ్రి నిలయంబునకుం బరువెత్తి తల్పులున్
దెఱవక మూసియుంటఁ గని నివ్వెఱఁగంది మదీయ సౌధమున్
దరియఁగ వచ్చి దీనవదనమ్మునఁ గన్నులు మూసియున్న నా
చరణము లందు వందనము సల్పఁగ నేత్రము లెత్తి చూచితిన్

అడిగిన మీఁద రాజగృహ మందలి సేమము లొక్క మాటలో
నుడువుచుఁ " దండ్రి యెందుఁ జనెనో వచియింపుము తల్లి! రాచదే
విడి నగుపింప రేమి " యని పృచ్ఛ యొనర్చిన యంత సిగ్గునున్
బిడియము వీడి తెల్పితి నవేల విచారకరంపు వృత్తమున్

" నీకై యింతలు సేయ నేర్చితిని దండ్రీ! యింక నీ కోసల
క్ష్మాకల్యాణికిఁ గూర్చు వల్లభుఁడవై సర్వప్రజాకోటికిన్
నాకున్ మంథరకున్ నిరంతమగు నానందమ్ము సంధింపరా
యే కోశమ్మున సంశయింపకు " మటం చే నిట్లు వాక్రువ్వఁగన్

గుండియ లాఁగినట్టులయి గొడ్డటఁ గొట్టిన మ్రాఁకు వోలె ని
ల్చుండిన వాఁ డమాంతముగ నుర్విని వ్రాలి యనంతరమ్మునన్
గొండొక తేటి నా వలనకున్ నిగిడించె నిదాఘ చండ మా
ర్తాండమయూఖసన్నిభ నితాంతనిశాత విలోకనచ్ఛటల్

" ఎంతకు సాహసించితివె! యింత యశిష్టపుటూహ లెట్లు నీ
స్వాంతమునన్ జనించినవి? పాయక నీ యెద వత్సలత్వపుం
గాంతులు నింపు నర్కకులగణ్యుని దేవతఁ బోలె నిన్నుఁ జే
తోంతర పీఠికన్ నిలిపినట్టి ప్రభూత్తము నెంత చేసితే!

నా కేదో యొక గొప్ప మేల్ సలుప యత్నం బింత గావించి కీ
డే కావించిన దాన వైతి కద కిస్సీ! పుత్ర చేతో హితం
బే కార్యంబొ గ్రహించి వర్తిలఁగ రాదే? పుత్రమోహానవే
గా కిమ్మాదిరి లోకముల్ కనలు దుష్కార్యంబుఁ గావింతురా?

రాముం డగ్రజ మాత్రుఁ డౌనొకొ? పరబ్రహ్మంబటుల్ మన్మన
శ్శ్రీమత్పీఠిక మీఁద నిల్పికొని సంసేవింతు నశ్రాంత, మా
రామస్వామి కృపాకటాక్షమున విభ్రాజిల్లు నీ దాసుఁ డీ
సీమన్ దా నెటు నిల్చు? నాతఁడు వనీసీమం బ్రవేశింపఁగన్

నినుఁ దల్లి యని యొప్పఁ బిల్చినను గానీ పొచ్చె మంటున్, బురా
జను రుగ్రాఘఫలమ్ము వెన్కొనుట రక్షఃప్రాయవౌ నీ యపా
వన గర్భమ్మునఁ బుట్టుకం గనెడి దౌర్భాగ్యమ్ము వాటిల్లెఁ బో ”
మ్మని నిందించుచు నేఁగెఁ గోసలసుతా హర్మ్యాభిముఖ్యమ్ముగన్

ఒక మృగయావినోది నిశితోగ్ర శరాహతి గాయపడ్డ యం
గకమున బిడ్డ దూరమున గాసిలుచుండఁగఁ బోతుపక్షి నే
లకు నొఱగన్ విశంకట విలాప మొనర్చెడి పెంటిపక్షి పో
లిక నయి యెంతయుం గళవళించుచుఁ గోసలపుత్రి కన్పడెన్

చరణాబ్జంబులపై శిరంబు వడ సాష్టాంగమ్ముగా వ్రాలి ని
ర్భర దుఃఖంబున వెక్కి వెక్కి విలపింపం జూచి “ నీ కేలరా
పరితాపింప ? విశాల కోసల మహీభాగంబు స్వేచ్ఛాగతిన్
బరిపాలించుకొనంగ వచ్చుఁ గదరా ! పట్టాభిషిక్తుండవై ”

అను కౌసల్య వ్యథావివర్ధక శితవ్యాహారముల్ సూదులై
తన డెందంబున నాట బిట్టడలి మత్ప్రారబ్ధ తంత్రంబునన్
దన కావంతయుఁ బాలు లే దని యథార్థంబున్ నిరూపించి వే
చని శ్రీరామునిఁ దోడితెత్తు నని యాశ్వాసించె నా తల్లినిన్

తైలద్రోణిక నున్న తండ్రి మృతగాత్రమ్మున్ విలోకించి "నా
పాలన్ నేరము లేమి గల్గినవి ? నాపై నింత కోపమ్మె నీ
కేలా ? పల్కవు చూడ వెందులకుఁ దండ్రీ" యంచు వాపోవుచున్
నేలం బొర్లె నయో ! ఘనాఘనములై నేత్రమ్ము లల్లాడఁగన్

అంత వసిష్ఠమౌని సకలాగమతత్త్వవిదుండు సెప్ప నొ
క్కింత సమాశ్వసిల్లి మది నించుక చిక్కఁగఁ బట్టి లోప మా
వంత ఘటిల్లకుండ దహనాదికముల్ నెఱవేర్చి తమ్ముఁడున్
జెంత వసింపఁ గర్మలను జేసి యథావిధి ద్వాదశాహముల్

"ఎందఱు వీడనాడి మఱియెంత మహావిభవమ్ము వీడి తా
నందుల కేఁగె మౌనియయి యందఱతో మఱి యంత మేదురా
మంద విభూతితోఁ దిరిగి మా జలజాప్తకులప్రదీపకుం
డిందుల కేఁగుదెంచ వలె నేత్తెఱఁ గోసల చక్రవర్తియై"

అని సాకేతము సర్వమున్ గదలి రా నారణ్య మార్గమ్ముఁ బ
ట్టిన వాఁడై యల చిత్రకూటగిరి నుండెన్ రాఘవుం డంచెఱిం
గిన వాఁడై చని యానతాఖిల జనాక్షీణోగ్ర పాపాపనో
ద నితాంతక్షమమైన తద్విమల పాదద్వంద్వ మందుం బడెన్

తనదు వియోగ దుఃఖ మమితంబయి దుస్సహమై కలంపఁగా
జనకుఁడు కూడు నీళ్ళుడిగి సప్తదినమ్ములకున్ గతాసువై
చనియె నటన్న వార్త కులిశప్రహరంబయి వేయి వ్రయ్యలై
చనఁగ నెడంద రాఘవుఁడు క్ష్మాతలి వ్రాలె గతస్మృతిన్ గటా!

ఎటులో తెప్పిఱి కొంత సేపటికిఁ "దండ్రీ! తండ్రి" యంచున్ బరి
స్ఫుట హాహారవముల్ పొనర్చె ధరణీపుత్రీ సుమిత్రాసుతుల్
పటు దుఃఖమ్మునఁ దూలి తన్ననుసరింపన్ వన్య జంతుద్విజ
చ్ఛట లొక్కుమ్మడి నార్వ నగ్గిరి దరీ సందోహ మూటాడఁగన్

పదపడి శ్రీ వసిష్ఠమునివర్యుఁడు వెంబడిరా సురాపగన్
గదిసి తిలోదకమ్ము లిడి కర్మ లొనర్చెను గారపిండియున్
బదరపు గుజ్జునుం గలిపి నల్వుగఁ గట్టిన పిండముల్ యథా
విధిగఁ బ్రదానమున్ సలిపి పెల్లగు భక్తి యెలర్పఁ దండ్రికిన్

తానై ముందుగ నగ్నిసంస్కృతికి శాస్త్రప్రోక్త మార్గమ్మునన్
బూనంగాఁ దగు జ్యేష్ఠపుత్రునకుఁ దత్పుణ్యమ్ము దవ్వై యర
ణ్యానిన్ గ్రుక్కుచు గారపిండిదగు పిండ మ్మేయఁగా నయ్యెఁ; నెం
తైనన్ దుష్ప్రతిరోధమైన విధిఁ బాయన్ ద్రోయ శక్య మ్మటే ?

అరుణుఁడు లోకవృత్తమరయన్ వెలు దివ్వెల తోడఁ బూర్వ భూ
ధరమును దాఁటి యంబర పథమ్మున సాగెడి వేళ మైథిలీ
వరుఁడొక చెట్టునీడ నిలువన్ బరమేశ్వరు చుట్టు నిల్చు ని
ర్జరులటు లంద అవ్విబుధసన్నుతు చుట్టును నిల్చి రంతటన్

సమయముఁ జూచి భ్రాతృవిలసచ్చరణమ్ముల నంటి " నిన్నర
ణ్యములకుఁ బుచ్చు తంత్రమున నా కిసుమంతయుఁ బాలు లేమి స
త్యము యగుఁ గాక యైన నిది యంతయు నాకొఱ కౌట నీ యన
ర్థమునకు మూల మే నగుదు రామవిభూ ! క్షమియింపుమీ ననున్

నీ వయి పూననైన ధరణీభర మే నెటు పూను వాఁడ ? ధ
ర్మావధిభూత ! పూన వలె నన్నను శక్యమె నన్ను బోఁటికిన్ ?
నా వినతిన్ గ్రహించి కరుణన్ జనుదెంచి విశాల కోసల
క్ష్మావిపులప్రజా వితతశాంతిసుఖప్రదమూర్తి గాఁ గదే !

రావా నీ చరణాంబుజంబుల కడన్ ప్రాయోపవేశంబునుం
గావింపం గృతనిశ్చయుండ నకలంకంబైన నీ చేతులన్
జీవంబుల్ విడనాడి మోక్షపదవిన్ జేకొందు " నంచున్ గుణ
శ్రీ వారాన్నిధి నా తనూభవుఁడు ప్రార్థింపన్ వ్యథాదీనుఁడై

"తగునటె తండ్రిమాట జవదాఁటఁగఁ బుత్రకులైన వారికిన్ ?
దగవు నెఱింగియున్ మనమె ధర్మముఁ దప్పి చరింతుమేని యే
పగిది ధరిత్రి ధర్మము ప్రవర్తిల నేర్చు ?" నటంచు నెన్నియో
తగవులు సెప్పె రాఘవుఁడు తా ననుజుండు నిరుత్తరుండు గాన్

చింతాక్రాంతమనస్కతన్ రఘుపతిశ్రీపాద విన్యస్త భా
స్వంత మ్మంచిత పాదుకా యుగము దీక్షాదృష్టి వీక్షించు నా
సంతానమ్ము హృదంతరాంతర విరాజద్భావ విద్యుల్లతా
కాంతిం గాంచిన శ్రీ వసిష్ఠమునిలోకబ్రహ్మ యుద్యన్మతిన్

"రామా ! నీ వరుదేవు, నీ యనుజుఁడో రాకున్నచోఁ దా నయో
ధ్యా మార్గంబును బట్టఁ, డింతయు యథార్థం, బిర్వురున్ ధార్మిక
స్వాములే, చిక్కెడలింప యుక్తమగు త్రోవన్ నేను సూచింతు నీ
శ్రీమత్పాదుక లానతీ ! మ్మితఁడు సంప్రీతాత్ముఁడై పోయెడిన్"

అనుటయు రామభద్రు మృదులామల గండయుగమ్ము విచ్చె, నా
తనయుని కన్నులన్ ధవళ తామరసమ్ములు విచ్చె, మా పురీ
జనుల హృదభ్రవీథికల సాంద్రములైన వినీల వారిభృ
ద్గణము లొకింత విచ్చె నొక కమ్మని తెమ్మెర వీచినట్టులై

పావలు కంటి కద్దుకొని భ_క్తియుతంబుగ విష్టరశ్రవః
పావన విగ్రహం బటుల భద్రముగాఁ దల మీఁద నిల్పి సీ
తావిభు కీ_ర్తనం బవిరతమ్ముగ సల్పుచుఁ బాదచారియై
నా వరపుత్రకుండు యతినాథుఁడునై చనుదెంచె వీటికిన్

ఆ కళ్యాణగుణాబ్ధి రామవిభు శూన్యంబై కళాహీనమౌ
సాకేతమ్మున నుండ నొల్లక శిరస్సాధిష్ఠ పాదూ యుగ
శ్రీకుండై చని నంది గ్రామమునఁ దర్చ్చిపాదువుల్ భద్ర పీ
ఠీకూటస్థ మొనర్చి తా మెలఁగుచుండెన్ గింకరప్రక్రియన్

*　　　*　　　*

నేనుం బోయితిఁ గాననంబునకుఁ గానీ యేమి లాభంబు ? రా
మా నా నేరము లెల్ల నోరిమి మెయిన్ మన్నించి భూభారమున్
బూనన్ రమ్మని వేఁడనైతిఁ జిబుకంబుం జేతులుం బట్టి దు
ర్మానం బేదొ యెడంద నూల్కొని యదమ్యంబై నిరోధింపఁగన్

నా దొక పిచ్చి గాని గురునాథుఁడు సెప్పినఁ బౌరముఖ్యులున్
బాదము లంటి వేఁడినను బాసఁ దొలంగని రామమూ_ర్తి యు
న్మాదిని కై క ర మ్మనిన మాత్రమునన్ జనుదెంచునా ? యయో
ధ్యాదయితత్వ మందుకొనునా ? పితృవాక్యము వీటిఁ బుచ్చునా ?

కై కే యి

కల రీ యుర్విని రాజపుత్రకు లసంఖ్యాకమ్ముగాఁ గాని కో
మల సుస్నిగ్ధ కపోలముల్ చిదిమినం బాల్గారు ప్రాయమ్మునన్
జలవాహమ్ముల చాటునన్ నిలిచి గర్జారావముల్ సల్పు ధూ
ర్తుల దుర్వార సురారులన్ దునుము యోధుం డెందుఁ గన్పించునే ?

కల రీ యుర్విని వీరయోధులు నసంఖ్యాకమ్ముగాఁ గాని పా
టిలు నాపత్తులకుం గలంతలకు గుండెల్ నిల్పుకో లేని యా
ర్తు లధీరుల్ వెడలించు నశ్రుసలిలస్రోతస్సులన్ బాష్పపున్
జలధారల్ గురియించు పేశల మృదుస్వాంతుండు గన్పించునే ?

కల రీ యుర్విని సత్కృపాళువు లసంఖ్యాకమ్ముగాఁ గాని ని
చ్చలు నారాయణ విస్ఫురచ్చరణకంజాతద్వయీ చింతనా
కలితశ్రీమతులైన సాధుజనరక్షా దివ్యదీక్షామతిం
బలవిక్రాంతుల ధారవోయఁ గల ధర్మాత్ముండు గన్పించునే ?

కల రీ యుర్విని ధార్మికోత్తము లసంఖ్యాకమ్ముగాఁ గాని కో
సలముం బోలిన విస్తృతప్రథితరాజ్యశ్రీ మహావైభవం
బుల సోదర్యునకున్ విమాతృజునకుం బోఁ బెట్టి యాశీస్సులన్
సలుపన్నేర్చినయట్టి త్యాగమయ రాజన్మూర్తి గన్పించునే ?

కల రీ యుర్విని ద్యాగమూర్తులు నసంఖ్యాకమ్ముగాఁ గాని యు
జ్జ్వలరత్నస్థగితమ్ములై తగు విభూషల్ పట్టు పీతాంబర
మ్ములు వర్జించి యతీంద్రయుక్త వసనమ్ముల్ చుట్టి కాంతార వీ
థులఁ బిత్రాజ్ఞ వసింపఁ బోవు పితృభక్తుం డెందుఁ గన్పించునే ?

కల రుర్విన్ బితృవాక్యపాలకు లసంఖ్యాకమ్ముగాఁ గాని ని
స్తుల మాత్సర్య మెడందఁ గ్రందుకొనఁ నైష్ఠుర్యమ్ము మీఱన్ హలా
హలముం బెట్టు విమాత నత్యధిక పాపాచారిణిన్ సాధు శీ
తల దృగ్రేఖలఁ జూచు శాంతసుగుణాధారుండు గన్పించునే ?

కల రుర్విన్ సుగుణాలవాలురు నసంఖ్యాకమ్ముగాఁ గాని యే
తలి యే పుత్రుని కోస మింతటి యసత్కార్యమ్ము గావించె నా
తలి యా పుత్రుఁడె పోయి దీనుఁడయి పాదా లంటి రా వేఁడినన్
దొలఁగం బోవని సత్యసంధుఁడు మహాత్ముం డెందుఁ గన్పించునే ?

ఇరుదెస నిల్చి యొక్క క్షణ మేనియు నేమఱుపాటు లేక కిం
కరులు బెడంగు వీవనలు గైకొని మెల్లఁగ వీచుచుండ మై
మఱపున నిద్ర వోవు సుకుమార మనోహర దివ్యమూర్తి కే
తెఱఁగున నిద్ర పట్టునొ కదే ! పెనుఁ గొండలఁ గాన కోనలన్

తెలియని వాఁడొకో యనిలదేవుఁడు రాఘవుఁ డన్న నెవ్వఁడో
మలయ మహీధరం బరిగి మక్కువమైఁ గొనితెచ్చి సౌరభం
బొలసెడి చందనం బలఁదకుండునె? వీవన వీవకుండునే?
యలయిక దీఱ నెమ్మదిగ నాతఁడు నిద్దురఁ గూరు నంతకున్

తెలతెలవాఱు వేళఁ జనుదెంచి విపంచిక మీటి మాగధుల్
పలికెడి మేలుకొల్పులు శ్రవస్సులఁ దాఁకిన మేలుకాంచు నా
జలరుహబాంధవాన్వయాంబునిధి చంద్రముఁ డే నినదమ్ము వీనులం
దొలసిన మేలుకాంచఁ గలడో కద! యా గహనాంతరమ్ములన్

నికట మహీజ శాఖికల నిల్చి శుకీపికముల్ మనోజ్ఞ గీ
తికల సమాలపించి రఘుదేవుని మేకొని మేలుకొల్పవా?
సకల చరాచరమ్ముల నజస్రము బిడ్డలఁ బోలెఁ జూచు నా
యకలుష సాధుమూర్తి కెటనైన రవంత కొఱంత గల్గునా?

మృదుతర హంసతూలిక పయిన్ శయనించినఁ గందిపోవు పూ
మెదు వగు మేని భూమిసుత మే నెటు వాలిచి నిద్రఁ గూరునో!
పదమును మోపరాని పెనుబాకులు వోని నిశాత కంటకా
స్పదమును గర్కశోపల విశంకటమైన మహాటవీస్థలిన్

అమల కృపాకటాక్షమున నారయదా పృథివీపవిత్రి ? దు
ర్గమవిపినస్థలిన్ బఱపు కంటెను మెత్తఁగఁ జేసి వేయదా ?
కొమరిత చెప్పరాని సిలుగుల్ పడుచుండినఁ జేతనైన సా
యము నొనరింప కే జనని యైనను జూచుచు మిన్నకుండునా ?

నానా వ్యంజన సంయుతం బయిన యన్నంబున్ జవుల్ గొల్పు భ
క్ష్యానేకమ్ములు వెట్టినన్ సరిగ నాహారింప లేరే ! యర
ణ్యానిన్ దామయి యేఱి తెచ్చికొని కాయల్ కందమూలమ్ము లా
కూనల్ తా రెటు లారగింతురొ కదా ! క్షుద్బాధఁ జల్లార్చుకోన్

క్రమము నతిక్రమింపక జగమ్మున కెల్ల ఋతూచితమ్ములౌ
నమలపదార్థరాసులు దయానిధియై సమకూర్చి స్వీయ ధ
ర్మము నెఱవేర్చు నా ప్రకృతిమాత నితాంత రసోత్కటమ్ములౌ
నమృతఫలోత్కరమ్ము లిడి యా సుకుమారులఁ దన్పకుండునే ?

అరయన్ భారతమానినీమణి కిలన్ బ్రాణేశ్వరుండే కదా
పరమేశుం, డటువంటి ప్రాణపతి తీవ్రక్లేశ సంతప్తుఁడై
ధరణిం గూలినఁ గాని నిష్ఠురత నేదం జాలఁగానైతి– మ
చ్చరముం గూరిన క్రూరకర్మలు మనుష్యత్వంబె కోల్పోవరా ?

కైకేయి

వరముం గాంచి వరప్రసాదిని శివున్ భస్మంబు గావింపఁగా
దొరఁకొన్నట్టి కృతఘ్నుశేఖరుని దైత్యున్ మించి ప్రేమార్ద్రునిన్
వరదాతన్ బతి సర్వ నాశమునకున్ బాల్పేసితిన్ నేను ద
త్కరుణాలబ్ధ వరస్వరూప విశిఖద్వంద్వప్రయోగంబునన్

అమలతపోధనుండు ధవళాంగుఁ డొసంగిన మంత్రశక్తిచే
నమరవిరోధి క్రొవ్వడఁచి యందిన తద్వరయుగ్మకప్రభా
వమునఁ గకుత్థ్స వంశము నపారవిచారమునందు ముంచి దౌ
ష్ట్యమున మహాపచారమును సల్పితి మంత్రమహోపదేష్టకున్

పతికై నిస్తులరాజ్యభోగముఁ దృణప్రాయమ్ముగా నెంచి సాం
ద్రతరారణ్యముఁ జేరఁ బోయినది సీతాసాధ్వి, నే బుద్ధిపద
ప్రతిమానంబగు రాజ్యభోగమునకై ప్రాణేశుఁ దూలింప నో
పితిఁ; బుణ్యాత్ములకున్ దురాత్ముల కిదే భేదంబు విశ్వంభరన్

పసుపుం గుంకుములే కదా! సతికి సౌభాగ్యంబు, స్త్రీరూప రా
క్షసి కీ చెన్నఁటి కైకకుం గుజనశిక్షాదక్షతారూఢి పెం
పెసలారన్ సముదారతామయుఁడు విశ్వేశుండు భావించెనో
పసుపుం గుంకుములం దొలంచుటయె సర్వశ్రేష్ఠమౌ శాస్తిగన్

అవురా ! ఘోరదురాత్ముఁరాలనగు నే నల్లాడు టట్లుండ నా
సవతుల్ నా యపచారమూలమున వైశ్వ స్త్యంబునున్ గూర్మి పు
త్ర వియోగంబు ఘటిల్ల దిక్కఱిన చందంబయ్యెఁ; దాఁ జెడ్డ క్రోఁ
తి వనం బంతయుఁ బా డొనర్చు నను రీతిన్ నేఁ బ్రవర్తించితిన్

భరతకుమారుఁ జూచుకొని భర్తృవియోగ దురంతదుఃఖపుం
గెరటము లే నడంచుకొని నెమ్మదిఁ గూరినఁ గూర వచ్చు, నె
వ్వరిఁ దిలకించి యూఱడిలు వారు సపత్నులు ? దుఃఖవేదనన్
మఱుఁగుట దక్క నిస్తరణమార్గము వేఱొకఁ డేమి గల్గెడిన్ ?

నరమాంసప్రియులైన దానవులు సంచారంబు గావించు భీ
కర కాంతారములోఁ గకుత్స్థకుల రాకాచంద్రు నీరేడు వ
త్సరముల్ క్రుమ్మరఁ బంపఁగా వలె నవశ్యం బంచు దుర్వార దు
ర్వరముం గోరిన పాడునాల్క యవదీర్ణం బేల కా దింతకున్ ?

పలుచని మేలి పట్టువలువల్ ధరియించెడు నా శిరీష పే
శల సుకుమార మూర్తులకు జానపదుల్ నయితమ్ముఁ దాల్పఁగాఁ
గలుగని పట్టచీరలను గట్టఁగ నిచ్చిన యీ పిశాచి చే
తులు శతధా విదూష్యములు తుండెములై పడ కేల నిల్చెనో ?

కై కే యి

బంగరు మేడ మెత్తనగు పానుపులం బొొరలాడు నా జగ
న్మంగళ మోహనాంగులు కుమారు లయోధ్యఁ దొలంగి పోవుచుం
డం గని నూఱు రేకులును డంబుగ విచ్చిన తమ్మిపూవులై
పొంగిన పాడునేత్రములు పోవక నేఁటికి నిల్చె నేటికిన్ ?

అమలినశీలసంపదకు నాకరుఁడై కరుణాసముద్రుఁడై
కమలని లేఁత నవ్వుల నిగారముఁ జిల్కు ప్రసన్నమైన యా
స్యమునఁ జెలంగు రాఘవుని చల్లని పాలన లోన శాంతి సౌ
ఖ్యములను జూఱఁ గొందు నని యాశపడెం గద! యెల్ల లోకమున్

సకలోర్వీప్రజ గట్టుకొన్న విపులాశాసౌధముల్ గూల్చి త
చ్ఛకలమ్ముల్ నిఖిలమ్ము నట్టనడిసంద్రానన్ బడన్ వైచితిన్
బ్రకటీభూత పిశాచవృత్తి, భువనవ్రాతవ్యథాహేతు పా
తకపుస్తుప్పల మూర కెట్లుడఁగు ? భుక్తంబై కదా ! తీఱెడిన్

కడుపునఁ గన్న పుత్రకుని కైవడి మిక్కుటమైన కూరుముల్
గడలుకొనంగఁ జూచుకొని గద్దియ నెక్కఁగఁ బోవు వేళకున్
గడుసరి ధూర్తురా లగుచుఁ గాఱడవుల్ దిరుగాడఁ బంపు నీ
చెడుగరి కైక పట్ల రఘుసింహున కెట్టి తలంపు గల్గెనో !

తఱుగని క్షోభమై నెద యెదాయెదలై వెడయూహ లేవియో
బెరసెడి నంతె కాని రఘువీరుఁడు మానవమానసాంతరాం
తరముల లోని మర్మము లుదారమతిన్ గమనించు విజ్ఞశే
ఖరుఁడయి నా తెఱంగు నవగాహన చేసికొనంగ నేరఁడా ?

తనకై కూర్చిన యాభిషేచనికపుం ద్రవ్యమ్ములన్ దమ్ముఁ గు
ఱ్ఱని కానందముతో నొసంగు మని యా రామయ్య కాంతారముల్
సనుచోఁ దల్లికిఁ జెప్పిపోయె నఁట; యా సౌజన్య సౌభ్రాత్రముల్
గణనీయమ్ములు గావటే ! సకలలోకస్తోత్రపాత్రమ్ములై

అరదము దింపి వచ్చు సమయంబున మంత్రికి రాజధానికిన్
మరలెడి వేళ నా ప్రియకుమారునకున్ గయికమ్మ నెవ్వరున్
బరుసపుఁ బ ల్కొకం డయినఁ బల్కఁగ రా దని చెప్పె నంట; యీ
పరమకిరాతి పట్ల రఘువర్యున కంతటి ప్రేమ యేటికో ?

శతధా ముక్కలు సేయఁగాఁ దగిన రక్షస్సున్ సముద్యత్కృపా
మతిఁ బై నీఁగను ప్రాల నీక మనుపం భావించు నా తాల్మి యీ
క్షితి నెవ్వారల కుండు ? నా సుకృతికిన్ గీడ్పాటు భావించు దు
ర్మతికిన్ బాపవిముక్తి యున్నదె ? తలంపన్ జన్మజన్మాలకున్

పదునాల్గేండ్ల యరణ్యవాసము సమాప్తంబై యయోధ్యాపురిన్
బదమున్ మోపినయంత " భాస్కరకులప్రఖ్యాతిఁ బోకార్చు బె
ట్టిదమౌ కృత్యము నాచరించితిని దండ్రీ! నన్ను శిక్షింపరా
కొదుకం బోకు " మటంచు వేఁడుకొనెదన్ గోదండరామప్రభున్

నను దండింపఁడు రామచంద్రుఁ డెటులైనం గాని, యవ్వాని దం
డన తోడం బని లేదు కూడఁ, దమయంతన్ దాముగా వచ్చి నె
మ్మనమున్ శూలము లేవియో యుఱక క్రుమ్మన్ సాగెఁ బో; చిత్త శాఁ
తిన్ని మాయింపక యూరకే చనునె ధాత్రిన్ సజ్జనద్రోహముల్ ?

అరుణుం డంబర వీధిపై నిలిచి చండాగ్నిస్ఫులింగంబులన్
గురియన్ సాగె నిజాన్వవాయ కలశాకూపార రాకాసుధా
కరు శృంగారగుణాకరున్ గృపణతాక్రాంతాత్మనై కాననాం
తర వాసంబున కంపియుంటి నని యత్యంతక్రుధాతప్తుఁడై

నా పాపిష్ఠముఖమ్ము నే కరణి నింకన్ బద్మినీభర్తకున్
జూపన్నేర్తును సిగ్గుమాలి ? యిటుపై శోభాదరిద్రాణమున్
బాపస్థానము నైన యీ చెనఁటి కొంపం గూలి జన్మాంతమున్
దాపజ్వాలల స్రగ్గి మ్రగ్గెద నితాంతక్షుబ్ధ చిత్తమ్ముతోన్

జననం బె త్తిన దాది నేఁటి వఱ కే సత్కార్యముల్ చేసి యు
న్నను దత్పుణ్యఫలమ్ము సొంతమును భగ్నంబై చనున్ నేఁ డొన
ర్చిన యీ దారుణ పాపకర్మమున నిస్సీ ! ఘోరకాకోలపుం
గణ మొండైనను జాలదే యమృత భాండంబున్ విభంగింపఁగన్ ?

ప్రాతస్సంస్మరణీయమై భయదపాపచ్ఛేదకంబై జగ
త్పూతంబై రఘురామునామమును నస్తోకప్రపంచప్రజా
వ్రాతవ్యాయతనింద్యమై స్మరణమాత్రస్ఫాయ దంహస్కర
ఖ్యాతవ్యం బయి నాదు నామమును నాకల్పంబు వర్తించెడిన్

భరతుఁడు నా యనుజ్ఞఁ దలపై వహియించి నృపాసనమ్ముపైఁ
జరణము మోపునంత యపచారము సేయక నన్నునున్ దిర
స్కరణ మొనర్చి ప్రాజ్ఞుల ప్రశంసలకుం దగె, లేకయున్న నా
దురితదవాగ్నికీలికలఁ ద్రోపడి దగ్ధము గాఁడె వాఁడునున్ ?

అనవరతమ్ము రాఘవుని యందుఁ గళంకము లేని భక్తి భా
వనమును జూపు నా భరతు పట్లను శంక జనించె నంట పో
జనులకు, నాదు గర్భమున సంభవ మందు టొకండు దక్క వాఁ
డొనరిచినట్టి పాప మొకఁ డున్నదె ? యీ యపకృష్ట నాటికన్

లోకులు ముందువెన్కలు విలోకన సేయక తోఁచినట్టులన్
వాకొనుచుందు రక్కట! యవద్యగుణాలయయైన తల్లి క
స్తోకగుణార్ణవుం డగు సుతుం డుదయింపఁగ రాదె? రమ్య రే
ఖాకరమైన తామరస మారయఁ బంకము నందుఁ బుట్టదే?

నాకున్ సద్గతి యన్న దే మయిన నుండన్నేర్చినన్ విశ్వ వి
శ్వైకారాధ్య పదారవిందుఁడును గళ్యాణప్రదుండైన సీ
తాకాంతున్ నిరతమ్ము నేమఱక సద్భక్తిన్ సమర్చించు సు
శ్లోకుండౌ భరతుండు నా తనుజుఁడై శోభిల్లుటన్ మాత్రమే

తా నొక్కండు పరేంగితజ్ఞుఁడు భరద్వాజర్షి మాత్రంబె నా
పైనిన్ జల్లని చూపులం బఱపి "దైవం బింతకున్ హేతువౌఁ
జూనా! నీవు నిమిత్తమాత్ర" వని యాశ్వాసించెఁ బంచాస్య గ
ర్జా నిర్హ్లాద మొనర్పఁ బోవక కృపాసాధూక్తులం బల్కుచున్

అమ్మునిరాజు దక్కఁ జతురంబుధిసంవృత మైన విశ్వ వి
శ్వమ్మున యందు నెందు నగుపట్టఁ డొకండును రోషవహ్నికుం
డమ్మున న స్దహింపఁగఁ గడంగని వాఁడును దూషణోక్తి వ
జ్రమ్మున నా యెడంద వెయి వ్రయ్యలు సేయఁ దొడంగ నట్టిఁడున్

రాముఁ డరణ్యముల్ సనినఁ బ్రాణము నిల్పఁగఁ జాల నంచు నా
స్వామి వచింపఁ బుత్రకునిపైఁ గల నిర్భరమైన ప్రేమచే
నా మెయిఁ బల్కె నంచు హృదయమ్మున నెంచితి నంతె కాని తా
నీ మెయిఁ గన్ను మూయు నని యెంచఁగ నైతిని లేశ మేనియున్

మును మునిరాజు గాధిజుఁడు పుత్రునిఁ దోడ్కొని పోదు నన్న నా
కనుల వెలుంగు రాఘవుఁడు గన్పడకుండిన మేనఁ బ్రాణముల్
క్షణమును నిల్పఁ జాల నని గాసిలి యూఁటట చెంద లేదె? యీ
దినమును నట్లయౌ నని మదిన్ దలపోసితి, మోసపోయితిన్

మునిపతి వెంబడిం జనిన మూఁడవ నాఁటికి వచ్చి క్రమ్మఱన్
గనఁబడు నంచు నూఱడిలినాఁ, డిపుడో పదునాల్గు వర్షముల్
వనముల నున్కి యౌ నని తలంపఁగ రా, డపు డుగ్రమూర్తులౌ
దనుజుల తోడి యుద్ధము గదా! యిపు డట్టి విపత్తి యున్నదే?

దనుజులకున్ మహాటవులు స్థానము, లచ్చటనున్ విపత్తి పై
కొను నవకాశ మున్న దని కొంకను జంకను రాదు, నాఁటి రా
మునకును నేఁటి రామునకుఁ బోలిక యేమి? ధనుర్గుణప్రసా
రణ పరికంపితాఖిల కరాళ నిశాటుఁడు సుమ్ము నేఁడు తాన్

అనురక్తుం డగుఁ గాక మామక మనోవ్యాకూతమున్ దీర్పఁగా
ననలజ్వాలల నైన దూఁకుటకు నాయత్తం బగున్ గాక యె
ప్పనివౌ కోర్కులు గోరి యెన్నఁ డయినన్ బ్రాణేశు వేధించి యుం
టిన ? ధర్మమ్మును దప్పి యుంటిన ? సతీ నిర్ణీత సామాన్యమున్

కేకయ రాజపుత్రి పతికిన్ వశవర్తిని భర్త నెన్నఁ డ
ఱ్ఱాఁకలు వెట్టఁ బోవ దని భ్రాంతిని జెందితి మింత వట్టు నౌ
రా ! కలరూపు నేఁటికి బయల్పడె నెంత గయాళి యం చిఁకన్
లోకు లపోహ చెంది కనలుం గని యెంతగ నీసడింతురో !

అడవికిఁ బంపి రాముని మదాత్మజు భూభుజుఁ జేయఁ జూడ నా
కొడు కటు పల్లెటూరఁ బడి కుందఁగనై యిటు ఘోరనిందయున్
నుడిసెను బో; దురాశకు నసూయకు లోఁగిన రెంటఁ జెడ్డ రే
వఁడు లగు వా రటంచు గుణపాఠము నేర్తురు గాక ! యెల్లరున్

చెప్పుడు మాటలన్ జెవినిఁ జేర్చిన నెంతటి వారి కేనియున్
ద్రిప్పలు తప్పఁ బో వని సుధీమణు లందఱు నొక్క గొంతుకన్
జెప్పరె ? దుర్వివేక నయి చెప్పుడు మాటకు వీను లొగ్గి యీ
ముప్పును దెచ్చి పెట్టితిని భూప్రజ లెల్లరుఁ దిట్టి పోయఁగన్

చిన్నతనంబు నందు రఘుసింహుఁ డెఱుంగక పిల్లచేష్టకున్
దన్నినఁ దన్నెఁ గాక మఱి దానికినిం బ్రతికారదీక్షయా ?
పున్నెము పాప మింత తలపోయని క్రూరపిశాచి కుబ్జకీ
తెన్నులు చెల్లెఁ గాక జగతిన్ మఱి యేరికి నైనఁ జెల్లునే ?

కూటికి గుడ్డకై పరుల కొంపల నూడెము సేయు నల్పపుం
జేటిక యెంత చేసినది ! చేటికఁ జేకొని వచ్చు వేళ నా
చేటిక బుద్ధి నింత పరిశీలన సేయఁగఁ బోలు నంచు హృ
త్పాటకమైన నాదు చరితన్ జగ మింక గ్రహించుఁ గావుతన్ !

జరిగిన గాథ నంతయుఁ బ్రశాంతముగాఁ బరికించు ధీర శే
ఖరుఁ డొకఁ డైన నెన్నఁటికిఁ గల్గక యుండున ? మాయలాఁడి మం
థర కత మింత సేగి కను తథ్య మొకింత గ్రహింపకుండునా ?
పిఱువడ కీ యథార్థమును విశ్వమునం బ్రకటింపకుండునా ?

ఒక నిర్దోషికి సాధుపుంగవున కేదో దుర్ముహూర్తమ్ము నం
దొక విద్రోహము నాచరించిన మనుష్యుం డెవ్వఁ డే నెన్నఁడో
యొక నాఁ డా యపరాధమున్ దలఁచుకొం చుల్లమ్ము సంక్షుబ్ధమై
శకలీభూతము గాఁగఁ గ్రాఁగెడిని బశ్చాత్తాప దావాగ్నిలో

ఆ యపరాధి జ్ఞాన మణువైనను లేని దురాత్ముఁ డైనచో
నా యనుతాపకీల సెలయన్ బహుకాలము పట్టవచ్చుఁ బో
ఆ యపరాధి జ్ఞాన మణువైనను గల్గు మనస్వి యైనచో
నా యనుతాపకీల విలయాగ్నిశిఖం బలె రేఁగుఁ గ్రచ్చఱన్

ప్రతినరు నందు రాక్షస సుపర్వ గుణమ్ములు రెండు నుండు, ను
ద్ధత దనుజప్రవృత్తు లెడఁదన్ జెలరేఁగిన వేళ నేదొ దు
ష్కృతి యొనరించినన్ విబుధవృత్తులు పైకొని నంత దానికై
వెతపడి తీరు; నింతయు వివేకు లెఱుంగరె? తత్త్వవిన్మణుల్

మఱి, సుగుణాకరుండు సుకుమారుఁడు రాముని మీఁదఁ బ్రాణముల్
దొఱఁగెడు నీ యభాగిని యెదో చెడుమూర్తము నందు నొక్క దు
ష్కరణము బుద్ధిపూర్వకము గాక యొకానొక నీచబోధచేఁ
బురికొని సల్పినన్ బిదపఁ బొక్కక క్రుక్కక యెట్టు లుండెడిన్ ?

చతురప్రజ్ఞులు సర్వమానవ మనస్తత్త్వమ్ము లూహించు పం
డిత మూర్ధన్యులు నేఁడు నా హృదయవాటిన్ దీవ్ర ఝుంఝానిలో
ద్ధతవీచుల్ చెలరేఁగి యే నిటులఁ బస్తాయించు టూహించి సం
తత సంక్షుబ్ధము నా యెడంద వెలయించన్ నుంత యత్నించరా ?

నా యపచారహేతు వొక నాఁటికి లోకు లెఱుంగకుందురా ?
పాయని వ్యాకులత్వ మెదఁ బాదులు గట్టిన దుర్ముహూర్త మం
దీ యహితంపుఁ జేఁతకుఁ దెగించెను "పాప" మటంచు జాలిమై
నా యెడ సానుభూతి నొక నాఁటికినిం బ్రకటింపకుందురా ?

జ్ఞానశ్రీనిధి శ్రీవసిష్ఠముని ప్రజ్ఞానిర్జరాచార్యుఁడై
తానై పెట్టినలగ్న మెందయిన వ్యర్థం బౌట వీక్షింతుమే ?
యీ నాఁ డీ యభిషేకలగ్న మిటులాయెన్; దన్మనీషా మహ
త్త్వానన్ లోపము గల్గునే ? విధివిచిత్రం బింతయుం గానిచో

చూడం జూడఁగ దైవలీలగనె తోఁచున్, గానిచో లోక సం
పీడాకారిణి పట్లఁ జూపుదురె తాల్మిన్ మా సుమంత్రాదులౌ
ప్రోడల్ ? మంత్రపునీతమైన సలిలంబుల్ సల్లినం జాలు నూ
టాడున్ లోకము లట్టి మా గురుఁడు నేలా ? సైఁచు నీ రక్కసిన్

మును లతిలోకబుద్ధిబలపూజ్యులు సర్వభవిష్య దర్శ ద
ర్శను లయి మంత్రశక్తుల నొసంగుచునుందురు గాదె ? రామ కా
నన గమనైక సాధనచణం బగు మంత్ర మొసంగు నొక్కొ ? దై
వ నియతి గాకయున్న యతి వల్లభుఁ డా ధవళాంగుఁ డయ్యెడన్

## కైకేయి

గుణధాముఁ డైన రాముని మీఁద మంథర
చెలఁగి కొండెము లేల చెప్ప వలయు ?
చెప్పెఁ బో నేఁ దెల్వి చెడి నా కుమారు భూ
ధవు నొనర్పఁగ నేల తలఁప వలయు ?
తలఁచితిఁ బో మహోదారుని జానకీ
పతినిఁ గానల కేల పంప వలయు ?
పంపితిఁ బో వనవాసమ్ము ముగియించి
రాఁ డొకో విభుఁ డేల ౹మంచ వలయు ?

నా నితాంతావివేక మింతకును హేతు
వని తపింతునా ? చింతాదవాగ్ని లోన —
అంతయును గర్మవశమున నయ్యె ననుచు
నూఱడిలుదునా ? యొక్క నిట్టూర్పు విడిచి

